శ్రీ

# రామగీతామృతసారము

(ఆంధ్ర వివరణ)





ప్రకాశకులు,
శ్రీమతి ముట్నూరి సీతామహాలక్ష్మమ్మ
నరసాపురం.

శ్రీ

వేదవ్యాస ప్రణీతంబగు

శ్రీమదధ్యాత్మరామాయణోత్తర కాండాంతర్గత

# రామగీతకు

ఆంధ్ర వివరణము.



శ్రీమతి ముట్నూరి సీతామహాలక్ష్మమ్మ.

Rs. 2/

 [~~వెల 0-12-0~~

కలియుగ కర్మశృంఖలములఁ ద్రెంచిన
కౌండిన్యసాన్వయ కవివరుండు
లక్ష్యంబునందు కృష్ణాదుని మించియు లౌకికో
ద్యోగ నిర్వహణుఁ డతఁడు
శివరామకృష్ణ శుశ్రూషాభక్తి యుక్తిచే
శివరామకృష్ణుఁడై వెలుఁగునతఁడు
పాతిక యేండ్లు పైఁబడకయే భౌతిక
పంజరబంధమున్ బాసెనతఁడు

ఆబుధుఁడె నాదు హృదయవిద్యాధిదైన
మఱిని భిక్షయౌ నా తెల్వి యతఁడె గురుఁడు
అక్షరానందసుఖమె మాయనుఁగుబిడ్డ
అఖిల లోకాభ్యుదయమె మా యాశయంబు.

# తొలి పలుకు.

శివుని జటాజూటమునుండి లోకకళ్యాణమునకై గంగాస్రవంతి భగీరథుని వలన భూలోకమునకు తేబడినది. విశ్వమానవకళ్యాణమునకై శ్రీ వివేకానంద స్వామిని కైలాసమునుండి శ్రీరామకృష్ణపరమహంస భూలోకమునకాహ్వానించెను. ఇట్లే అత్మతరణము అక్షరానందత్వముఅను స్వార్థపరతను విడనాడి మహా యోగిపుంగవులు లోకమునుద్ధరించుటకై భౌతికశరీర బంధనములజిక్కి బాధలు పడిరి. నారదుడును ఆట్లే తాను బ్రహ్మర్షియయ్యు కలియుగమున అధర్మాచరణులై విషయభోగలాలసులై పాపామయపీడితులైన జనుల దుఃఖనివారణోపాయమునకై బ్రహ్మలోకమునకేగి బ్రహ్మవలన రామగీతారహస్యమును లోకమున ప్రవర్తింపజేసెను. వెలుగువలన చీకటి నశించునట్లు జ్ఞానాగ్నివలన సంచితకర్మరాశి మటుమాయమగును. గావుననే ఈగీతాశ్రవణ మననములవలన సమస్తపాప సంచయములును పటాపంచలగుచున్నవి. "వినా దానం వినా ధ్యానం వినా తీర్థావగాహనమ్। మోక్షం దదాతి శ్రీ రామగీతా" అను సాక్ష్యోక్తినిబట్టి మోక్షమొసగ సమర్థమయినది రామగీతయేనట. ఇది సంభవమే. ఎందువలనన దానధ్యానతీర్థములు ప్రకృతిలోనివే. ప్రకృతికతీతమును అవాఙ్మానసగోచరంబును అగు అనుభవమును గలిగించు రామగీతాప్రభావమునెఱుట సత్కర్మలన్నియును బుద్బుదప్రాయములే. కనుకనే బ్రహ్మహత్యాపాపము నశించుటకు రామగీతా పఠనమే శరణ్యము. రజ్జుసర్పభ్రాంతి నశించినపిదప ఇక ద్వంద్వమయప్రపంచకమే లేదు. స్వప్నభయము మేల్కాన్నపిదప పోవునుగదా! కృష్ణుడు అర్జునునకు ఉపదేశించినదీ రహస్యమే. కాని యీబ్రహ్మజ్ఞానము అనర్హునకు విషముగను అర్హునకు అమృతసదృశముగను పరిణమించును. కావుననే మహాదేవుడు శంకరునంతవానిని శిష్యునిగ గ్రహించియు ఆయనకుగూడ రామగీతనే ఉపదేశించెను. శంకరునివలన మూలప్రకృతి తదర్థమువాత్రమే గ్రహింపగలిగినది. అందులో అర్థభాగమే బ్రహ్మ శంకరునివలన తెలిసికొనగలిగెను. ఆబ్రహ్మ నారదునకు తెలపగలిగినది కించిత్తుమాత్రమే. అట్టి శ్రీరామగీతామహాత్మ్యరహస్యమును

మనము గ్రహింప ప్రయత్నించుట సముద్రజలమును పానపాత్రతో కొలుచుట వంటిది. అయినను ధర్మసూత్రములపఠించుట, ధర్మాచరణమొనర్చుట, ధర్మముల లోకకళ్యాణవ్యాప్తికై ప్రయత్నించుటయను ఇవి పరులకొరకే కాక స్వకీల్బిష నిర్మూలనమునకే యను నిరహంకారభావముతో సంస్కృతభాషాపరిచయములేని ఆంధ్రులకొరకీ గ్రంథము తెలిగించి ఆంధ్రలోకమునకీ గ్రంథకర్త అపారసేవ చేయుచుండె. శ్రీరామహృదయమున కలంకారమైన యీసుమము ఆంధ్ర సోదర సోదరీమణుల నాకర్షించుగాక. ఉపనిషత్సముద్రమును మథనముచేసి గ్రహించిన ఈరామగీతాసుధను శ్రీరామచంద్రులు లక్ష్మణునకు ప్రసాదించుటచే ఇయ్యది సర్వలోకమంగళకరమై వెలుగుగాక. వేదాధ్యయనఫలము, శాస్త్రవిజ్ఞానఫలము ఈరామగీతాహృదయము నెఱుంగుటకే కావున నేతత్ఫలము ఈ గీతాపారాయణమువలన సులభముగ పొంది, అల్పాయుష్కులగు నీకలియుగవాసులు ఈ రామగీతార్థమువలన అద్వితీయానందాంబుధి నోలలాడుదురుగాక!

ఇట్లు
డాక్టర్:- మలపాక రామమూర్తి.

# ఉపోద్ఘాతము.

ఓ సోదర సోదరీమణులారా! సర్వేశునికృపచే లోకములో కరుణయు, శాంతియు, సద్భక్తియు, సత్యనిష్ఠయు, విజ్ఞానబోధయును వర్ధిల్లునుగాక. అఖిలాత్మ కరుణాస్వరూపులారా! అనాదియగు సంసారబంధ దుఃఖమునుండి విడువడుటకు ఉపాయములు పలువిధములు. అవి భగవదాజ్ఞానురూపములగు శ్రుతిస్మృతులయందు విధింపబడియున్నవి. కాని అయ్యవి సద్గురువులగు మహాపురుషుల సాంగత్యముచేత ననుష్ఠించినగాని బోధపడనేరవు. అట్లయినను మోక్షోపాయంబులగు ఉపనిషదాది మహాగ్రంధములు సంస్కృతమూలముగనే యున్నందున అట్టి మాతృభాషాపరిచర్య [illegible] లేనివారికి ఇట్టి మోక్షసిద్ధి దుర్లభముగానున్నది. కాని [illegible] స్త్రీపురుషాదులుసహితము ఆబాలగోపాలముగా వ్యవహారాదివిశేషములయం దైనను మాతృభాషయగు సంస్కృతమునే అతిసులభముగా మాటలాడుచుండెడివారు. రానురాను అట్టి మాతృభాషా పరిజ్ఞానము ఇంతకాలమునకు అంతరించినది. అందులకు విదేశీయుల సాంగత్యాదులచే హూణభాషయందే అభిరుచి కలిగియుండుటయే కారణము "సంగః కారణ మాపదాం" యను న్యాయానుసారము బ్రహ్మవిద్యకు మూలకారణమగు సంస్కృతభాషయందు అభిలాష తగ్గినది. ఇంత స్వల్పపరిమాణమగు మానవజీవితములో స్త్రీపురుషాదుల నేకులు వార్తాపత్రికలయందును, నాటక నవలలయందును, సంగీతసాహిత్యములయందును అభిలాషగలవారై అమూల్యమగు మానవజీవితమును వృథాగా వ్యయప్రయాసాదులచే వ్యర్థపరచుచున్నారు. ఇట్టి విషమస్థితిలో సంస్కృతభాషా మూలగ్రంధములందు గుహ్యముగా యుండిన బ్రహ్మవిద్యను తాత్పర్యరూపముగా తెలుగులోనికి మార్చి తెచ్చుట అత్యవసరము. ఇది భగీరథప్రయత్నమువలె కష్టసాధ్యము. ముందుచెప్పిన అనేకవిధములగు మోక్షోపాయములలో శ్రీరామగీత, శ్రీకృష్ణగీత యీరెండు ముఖ్యములుగా ముక్తిమంటపము అలంకరింపచేయుటకు సాధనములుగానున్నవి. అదెట్లనగా ఒకే శరీరమునందు నేత్రగోళములు రెండైనను, చక్షురింద్రియము

మాత్రము ఒకటేయైనట్లు ముందుచెప్పిన రామకృష్ణాదిగీతలలో అనుభవార్థము
మాత్రము ఒకటేయైయున్నది. ఎంతవరకు మానవమాత్రుల హృదయములందు
శ్రీ గీతాభాస్కరుడుదయింపడో అంతవరకు సంసారబంధ దుఃఖమునుండి విడువబ
జాలరు. గాన యిందుకుతగిన గురుశాస్త్రాదులు లభించినపుడే నిశ్చయముగా
దుఃఖనివృత్తియు ఆనందప్రాప్తియు ప్రాణిమాత్రులకు లభించుచున్నది. ప్రస్తుతము
నరసాపురవాస్తవ్యులును, బ్రాహ్మణులును ముట్నూరి సీతామహాలక్ష్మమ్మగారను
సార్థకనామధారిణియునగు మహాతల్లి సంస్కృతమునందు చిన్ననాటనుండియు
పూర్వపుణ్యసహాయముచే లెస్సగాపాటుపడుచు శ్రీమదధ్యాత్మ రామాయణము
నందు సప్తమకాండములో పంచమసర్గయందలి శ్రీరామగీతకు లెస్సగా తాత్పర్యము
వ్రాసియున్నారు. ఈ కలియుగములో వేదాంతవాక్య పాండిత్యప్రతిభ ప్రకా
శింపచేయుట బహు దుస్తరమైయున్నను వారికి వంశపారంపర్యంబుగా వచ్చుచుం
డెడి పుణ్యప్రభావంబుచేతనే సులభసాధ్యముగా నిట్టి మహోన్నత కార్యము
నందు పాల్గొనగల్గిరి. అట్టి యుద్గ్రంథమును మమ్ము చూడుమని చెప్పినందున
ఆమూలాగ్రముగా పరిశీలించడమైనది. అందుచే నీగ్రంథముద్వారా వారికిం
గల జ్ఞాన, భక్తి, వైరాగ్యములకును, త్యాగదానాది ధర్మప్రవర్తనములకును
యెంతయోనామది సంతసించినందున యీ ఉపోద్ఘాతము వ్రాయవలెనని ఉత్సా
హముకలిగినది. అదియునుగాక శ్రీరాముని అభిప్రాయమంతయు సీతామహా
దేవియే గ్రహించవలెనుగాని యితరులకు శక్యమగునా! అందుకొరకే కాబోలు
ఈమెకు సీతామహాలక్ష్మియని సార్థకనామము భగవత్కృపచే లభించినది.
ఓహో! యిట్టి సతీమతల్లులు లోకములో ప్రాణులకు అథవా ముముక్షుజను
లకు గొప్ప ఆదర్శప్రాయముగానున్నారు. పూర్వము శ్రీగార్గి, మైత్రేయి,
చూడాల, సులభ, మందాలస మొదలగు బ్రహ్మవిద్యావతులగు మహాతల్లుల
అంశసంభూతులగుటచేతనే ఇట్టి పవిత్రత లభించినది. ఇట్లు

చరాచర సుఖాభిలాషిణి

గోడు జోగమాంబ.

# పీఠిక.

ఆంధ్ర సోదర సోదరీమణులారా!!

ఈశ్వరార్పణముగా తెనిగించిన యీ రామగీతయందేమైన లోపములున్నచో యవి నావిగను, గుణసత్యాంశవిశేషములున్నచో అవి కీర్తిశేషులైన మాతండ్రిగారివిగను గ్రహింప తొలుత ప్రార్థించుచున్నాను. సస్కృతవిద్వాంసులును, వైరాగ్యభావసంపన్నులును అగు మాతండ్రిగారు నాకొసగిన ఈస్వల్ప విద్యాసంస్కారమును సద్వినియోగముచేయుటకై సంకల్పించియు, తనుగన్న సాధ్వీమతల్లియగు మాతల్లిగారికి ఈ కృతజ్ఞత వెలిబుచ్చదలచియు ఈప్రయత్నమునకు సాహసించితిని. మాతండ్రిగారు సామాన్య పితృవాత్సల్యముతోగాక విశేష విద్యావివేకములను నాకు బోధించుపట్ల గురువువలె శాసించుచు నా పారలౌకికజీవితమునకై అహర్నిశలు శ్రమపడి నాచే సంస్కృత భాగవత రామాయణాది గ్రంథముల పఠింపచేసి నాకు తరుణోపాయము దెల్పి తాము సన్యాసాశ్రమము స్వీకరించి తమ స్వార్జితము నీశ్వరార్పణముగా నొనర్చిన నారాయణాంశ సంభూతులు వారి జ్ఞానసముద్రమందు నాయీ అల్పజ్ఞానము ఒక బిందువుగ గ్రహింతురుగాక.

మా అక్కగారును, నేనును బదరీనారాయణయాత్రకు వెళ్ళినపుడు అచట మార్గమున అలకనంద భగీరథీ మందాకినీ స్రవంతుల దర్శించిననాటినుండి శ్రీరామగీతాలహరి నా హృదయాంతరమున ఉప్పొంగ మొదలిడినది. నేటికి ఆ పుణ్యలహరి యీ గ్రంథరూపమున లోకమును సేవించుభాగ్యము నాకొసగినది. బదరీనారాయణయాత్రకు ప్రోత్సహించి తమ ఆశీస్సులతోను, ధనసహాయముతోను మమ్ము పంపిన పితృమాతృసమానులగు మా అన్నగారికిని వదినగారికిని మా కృతజ్ఞత తెల్పుకుండిన యీ గ్రంథవ్యాఖ్యానఫలము నాకు లభింపకుండును. ఆయాత్రామహాత్మ్యమే ఆపుణ్యనదీతోయంబుల ప్రభావమే నాకీ శ్రీరామగీతా రచనకు బుద్ధి పుట్టించినది.

ఈ గ్రంథము స్త్రీలచే రచింపబడినదని అనాదరణ చేయకుందురుగాక. "గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః" అనియే ఆర్యోక్తి కదా! అదియుగాక స్త్రీలకు బ్రహ్మవిద్యాకారణతకూడ చెప్పబడుచున్నది. ఈ బ్రహ్మవిద్య భూలోకమున వ్యాపించుటకు స్త్రీలే కారకులు. అదియెట్లన మొన్మొదట పరమేశ్వరుడు రామునియొక్క పరతత్త్వమును పార్వతీదేవికి ఉపదేశించెను. అటు ఉపదేశించుటయేగాక భవానీయొక్క శ్రేష్ఠత్వమునుగురించి ఇట్లు వర్ణనచేసెను. "శ్లో॥ ధన్యాఽసి భక్తాఽసి పరాత్మనస్త్వం యజ్ఞాతుమిచ్ఛా తవ రామతత్త్వమ్। పురా న కేనాప్యభిచోదితోఽహం వక్తుం రహస్యం పరమం నిగూఢమ్" అని శ్రీరామహృదయమునందు చెప్పబడియున్నది. (దీని తాత్పర్యము:- పార్వతీ! నీవు శ్రీరామునియొక్క యథార్థస్వరూపమును గురించి ప్రశ్నించితివి గాన ధన్యురాలవు. నేనును ధన్యుండనైతి. మిక్కిలి నిగూఢమగు ఈ రహస్య పరతత్త్వమును గూర్చి నన్ను నీవుతప్ప ఎవరును ప్రశ్నింపలేదు. గాన నిజ యథార్థమును తెలిపెదను వినుము. పాలయందు నెయ్యివలెను, నువ్వులయందు నూనివలెను భగవత్తత్త్వము సర్వలోకములలోను అతి రహస్యముగను నిగూఢముగను ఉన్నది. బాహ్యాభ్యంతరములయందు పరమాత్మవస్తువు నిండియున్నను సామాన్యబుద్ధికి గోచరముగాక విశేషమగు సూక్ష్మబుద్ధికే గోచరమగుచున్నది.) అని ఈ రహస్యమంతయు పార్వతికి బోధించెను. ఇటులనే రాధాదేవికి శ్రీకృష్ణుండును, ఆంజనేయునకు సీతాదేవియు శ్రీరామునియొక్క యథార్థస్వరూపము నుపదేశించిరి. మరియు శ్రీమహావిష్ణువు శ్రీదేవికి, భూదేవికి ఉపనిషత్సారభూతమగు భగవద్గీతనంతయు ఉపదేశించెను. ఇట్లే ప్రాచీనకాలమునుండి గార్గి మైత్రేయి చూడాల సులభ కాత్యాయిని మొదలగు బ్రహ్మవిదుషీమణులగు స్త్రీలెందరోగలరు. అందు గార్గియను స్త్రీ జనకమహారాజుయొక్క ఆస్థానమహాపండితసభయందు బ్రహ్మవిద్యానిష్ఠాగరిష్ఠుండగు శ్రీ యాజ్ఞవల్క్యమహర్షితో గొప్ప బ్రహ్మవాదముచేసినట్లు శ్రీ బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పబడియున్నది. శ్రీ సీతాదేవియు ఆంజనేయునితో "శ్లో॥ మాం విద్ధి మూలప్రకృతిం సర్గస్థిత్యంతకారిణీమ్। తస్య

సన్నిధిమాత్రేణ సృజామీదమతంద్రితా॥ తత్సాన్నిధ్యాన్మయా సృష్టం తస్మిన్నారోప్యతేఽబుధైః॥" అని చెప్పినట్లు రామహృదయమునందు చెప్పబడియున్నది (తాత్పర్యము:- ఓఆంజనేయా! నిర్వికారనిర్గుణపరబ్రహ్మసన్నిధానమున ప్రకృతినైన నేనే యీ సమస్తబ్రహ్మాండభాండములన్నిటిని సృష్టించుట, రక్షించుట, లయించుట మొదలగు క్రియలన్నియు చేయుచున్నాను. అయినను ఈరహస్యమును తెలిసికొనలేక నిర్వికారుడగు పరబ్రహ్మమునందే ఈప్రకృతి వికారములన్నియును ఆరోపణచేయుచున్నారు. రాముడయోధ్యలో దశరథునకు ఉద్భవించి సీతను వివాహమాడి రావణ కుంభకర్ణాది రాక్షసుల వధించుట మొదలగు క్రియలన్నియు చేయుచున్నాడనియు పండితంమన్యమానులు ఆరోపించుచున్నారు. ఆయనసత్తాచేతనే రామకృత్యమువలెకనబడు కృత్యమంతయు ప్రకృతినైన నాదియే.) శతకంఠరామాయణము, సహస్రకంఠరామాయణము మొదలగువానియందును ఈఅభిప్రాయమే చెప్పబడియున్నదిగాన బ్రహ్మవిద్యాధికారమంతయు ప్రకృతికే సిద్ధించియున్నదిగాని పురుషుడు నిర్వికారుడగుటచే వానికి బ్రహ్మవిద్యాగ్రహణమునకు అవకాశములేదు. కాన నిట్టి స్త్రీరచిత సద్గ్రంధములెంతయు నాదరణీయములే యగు.

ఇట్లు

రామసేవాభిలాషిణి.

# అభిప్రాయములు.

శ్రీ శివాయ గురవేనమః

గం॥ స॥ ముట్నూరి సీతామహాలక్ష్మిచే రచింపబడిన రామగీతతాత్పర్య మును చూచితిని. సుబోధకముగానున్నది. ముముక్షువులు ఈగ్రంథముద్వారా గొప్ప అధ్యాత్మవిద్యాఫలమును పొందగలరు.

శ్రీ జగద్గురు వేదాంతాచార్యసార్వభౌమ
ఉపన్యాసరత్నాకర,
పరమహంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీ శ్రీ శ్రీ నిత్యానందేంద్ర
సరస్వతీస్వాములవారు.

ఉపనిషద్గీతావిహార్,
రామారావుపేట,
కాకినాడ.

---

శా॥ మీయాంధ్రీకృతరామగీతసరణిన్ బ్రేమమ్ముతోఁ గాంచితిన్
జ్ఞేయంబౌ పరతత్త్వముం జదివి సంసృత్యబ్ధిఁ బిందాట న
మ్మా! యద్వైతము జేటమాటలరచింపన్నేర్చినా విట్లు నీ
సాయంబెంతయు నార్కచంద్రము బుధస్తవ్యమ్ముగాదే భువిన్

గీ॥ లలిత ముట్నూరికులదీపక కళికవోలె
నలరి సీతామహాలక్ష్మియనెడుపేర
నెసగు స్త్రీమణి విట్టిసత్కృతిని మంచి
తెలుఁగునకుమార్చితీవ ముక్తికినిదోవ.

మామిళ్ళపల్లి సూర్యనారాయణశాస్త్రి.
కిర్లంపూడి.

# కృతజ్ఞత.

మహాశయులారా!

పరమేశ్వరాజ్ఞచేతను, శ్రీరామానుగ్రహమువలనను నేనీ రామగీతను ఆంధ్రటీకానువాదముగ రచించితిని. ఇయ్యది ఆర్యుల పర్యవేక్షణనొందకయే యచ్చొత్తింపతగదని తలచి యందులకై యెదురుతెన్నులు చూచుచుండ, నింతలో నా శ్రీరాముడంపెనోయనునట్లు ఉభయభాషాప్రవీణేత్యాది బిరుదాంకితులగు బ్ర. శ్రీ. కొట్ర సీతారామసోమయాజులుగారు నర్సాపురం స్థానిక టైలరున్నత పాఠశాలకు సంస్కృతపండితులుగా విచ్చేసిరి.

తోడనే వారికడకేగి నాకృతిని వినిపించి యందలిదోసంగుల దొలగించుచు నవసరమగునెడ విషయవివరణమొనర్చుచు సవరింపుడనికోరితిని. వెంటనే వారందులకియ్యకొని పండితంమన్యమానులవోలె స్త్రీరచిత గ్రంథానూయాదులనేమియు నిసుమంతయునొందక కడు శ్రద్ధాభక్తులతో నాశ్రమకినుమడిగ శ్రమించి సవరించిరి. అచ్చొత్తించునెడకూడ సమయానుకూలంబులగు చక్కని సలహాల నొసంగి చాలవరకు ముద్రణాసవరణముగూడ తామేయొనర్చి నారచనను తీర్చి, దిద్ది మెరుగువెట్టి లోకమున కందింపచేసిరి. వారొనర్చిన యీ మహోపకృతికి నాకృతజ్ఞతాభివందనములొనర్చుచు పరోపకారపరగుణసహనాది సుగుణగణ గణ్యులగు వీరిని ఆ రాముండు ఇతోధిక ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులొసంగి బ్రోచుగాతయని కోరుచున్నాను.

శ్లో॥ వాంఛాసజ్జనసంగతౌ పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాసు వ్యసనం స్వయోషితి రతిః లోకాపవాదాద్భయమ్।
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలైః
ఏతేయేషు వసంతి నిర్మలగుణా స్తేభ్యోమహద్భ్యోనమః॥

మరియు ఈగ్రంథమును ఆమూలాగ్రముగ పరిశోధించిన శ్రీజగద్గురు వేదాంతాచార్య సార్వభౌమ ఉపన్యాసరత్నాకర పరమహంస పరివ్రాజికాచార్యవర్య శ్రీ. శ్రీ. శ్రీ. నిత్యానందేంద్ర సరస్వతీస్వాములవారున్ను,

మామిళ్ళపల్లి సూర్యనారాయణశాస్త్రిగారున్ను,

తొలివాక్కులలో గ్రంథప్రాశస్త్యమును శ్రీ గీతామహాత్మ్యమును పలికిన శ్రీ డాక్టరు - మలపాక రామమూర్తిగారున్ను,

శ్రీ యెలమంచిలి వాస్తవ్యులును శ్రీరాధాకృష్ణాశ్రమాధ్యక్షులును యగు శ్రీమతి గాడు జోగమాంబగారున్ను. ఈ మొదలగువారందరున్నూ యీగ్రంథమును ఆమూలాగ్రముగా పరిశోధించుటయేగాక, ప్రేమపూర్వకముగా ఉపోద్ఘాతములుకూడ వ్రాసినందులకు వారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈపుస్తకము చక్కని ముత్తెములవంటి యక్కరములతో నచ్చొత్తించి కన్నులపండువగా బైండుచేసియర్పించిన శ్రీ సీతారామా పవర్ ప్రెస్ మేనేజరు గారగు శ్రీ. పోతరాజు సుబ్బారావుగారికి నిందుతో కృతజ్ఞతాభివందనంబు లర్పించుచున్నాను.

ఇట్లు,
విధేయురాలు
గ్రంథకర్త్రి.

# ప్రార్థన.

శ్లో॥ వందే గురూణాం గురుమాత్మదైవతం శృణోమి విష్ణోశ్చరితాని నిత్యమ్

యన్నామ గృహ్ణన్ పరమేతి మూర్ధ్నో తం సర్వభూతావసథం. స్మరామి.

శ్లో॥ యద్‌జ్ఞానినో హృద్గుహే విచిన్వన్ తద్బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా వదంతి

తదేవ బ్రహ్మాహమస్మీతి వేద్మి యన్మహో గురోః మే ఈదృక్ కృపాళుతా

శ్లో॥ ఏకదంతముమాపుత్రం హృదయే ధారయామ్యహమ్

అనేకదం తం భక్తానాం సూక్ష్మబుద్ధేశ్చ కారణమ్.

శ్లో॥ సరస్వతి నమస్తేస్తు సదా సహచరీ భవ

గీతార్థం విలిఖామ్యద్య హృదయాం మాపసన్నతు

శ్లో॥ కేనాపి రూపేణ నియోజితాహం శ్రీరామగీతాం వివచామి ముక్త్యై

తం సర్వభూతాధివాసస్వరూపం పశ్యామి విష్ణుం హృది జ్ఞానదృష్ట్యా

శ్లో॥ మాతాపిత్రోశ్చ మే వందే చరణౌ ముక్తిదాయకౌ

యాభ్యాముత్పతితో దేహోతౌ పూజ్యౌ దంపతీగురూ

శ్లో॥ దృష్టాంతో నైవ దృష్టస్త్రిభువనజఠరే సద్గురోర్జ్ఞానదాతుః

స్పర్శశ్చేత్తత్ర కల్ప్యః సనయతి యదహో స్వర్ణతామశ్మసారం

న స్పర్శత్వం తథాపి శ్రితచరణయుగే సద్గురుస్స్వీయశిష్యే

స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమస్తేన చాలౌకికోపి॥

శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం

సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్।

ఆజానుబాహు మరవింద దళాయతాక్షం.

రామం నిశాచర వినాశకరం నమామి॥

ఓం!

శ్రీరామ చంద్రాయనమః

# రామగీత

## శివుండు పార్వతికి రామలక్ష్మణసంవాద రూపంబున పరతత్త్వమును దెల్పుట.

ఓభవానీ! పరాత్పరుండును విజ్ఞానదృగుండును కేవలుండును విలాసార్థంబుగా శరీరధారియునగు రాముండు కౌసల్యాగర్భంబున నుద్భవించి ఖరుడు రావణుడు మొదలగు భూభారకులగు రాక్షసులందునిమి అయోధ్యకుంజేరి లోకాపవాదమిషచే గర్భిణియగు సీతను కాననంబునకుంబంపి సీతారహితుండై మాయారహితుండుగా లోకంబునకు దెల్పుచు సమస్తవిషయవిరక్తుండై మునీశ్వరులచే సేవింపంబడు చరణయుగ్మంబుకలవాడై మునీశ్వరులచరణయుగ్మంబులను సేవించుచున్నవాడై యుండెను.

**శ్రీమహాదేవః॥శ్లో॥ తతో జగన్మఙ్గళమఙ్గళాత్మనా విధాయ రామాయణ కీర్తిముత్తమామ్। చచార పూర్వాచరితం రఘూత్తమో రాజర్షివర్యైరభిసేవితం యథా॥౧**

టీక:_ ఆంధ్రవివరణము. అనంతరమున జగత్తులోని సమస్తానందంబులకును స్థానీభూతమైన ఆనందస్వరూపుండగు రామచంద్రుండు "తస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" 'మఙ్గళానాఞ్చ మఙ్గళమ్' అని శ్రుతులయందు చెప్పబడినట్లు జగదాకర్షణాధారంబైన నీలమేఘశరీరధారియై శ్రోత్రాదులకు మోక్షంబునిచ్చునదియును వాల్మీక్యాదులచే అనేకవిధములుగా వ్రాయబడినదియునగు రావణవధ మొదలగు కార్యకలాపంబువలన గలిగిన రామాయణ ప్రవర్తకమగు కీర్తిని జగంబునందు నింపి స్వవంశజులును అన్యరాజన్యులును

ఆచరించినట్లు ప్రజాపాలనావిధానంబును సత్కథాశ్రవణంబును సీతాపరిత్యాగానంతరమునగూడ తాను నాచరించినవాడయ్యెను.

**శ్లో॥ సౌమిత్రిణా పృష్ట ఉదారబుద్ధినా రామః కథాః ప్రాహ పురాతనీ శ్శుభాః । రాజ్ఞః ప్రమత్తస్య నృగస్య శాపత ద్ద్విజస్య తిర్యక్త్వ మథాహ రాఘవః॥ ౨॥**

టీక:_ ఉదారమైన బుద్ధియు గురుదేవతావిశ్వాసమునుగల లక్ష్మణునిచే నడుగబడిన రాముండు (లోకాన్ రమయతీతి రామః, అస్మిన్ రమంతే యోగిన ఇతివా రామః) క్రిందవివరించురీతిని *నృగమహారాజు తిర్యక్త్వమునొందిన కథను యోగ్యములైన రాజ్యసంబంధములగు గాథలను బోధించి పరమధార్మికుండైన రాజునకుగూడ అజ్ఞానకృతమైనను బ్రహ్మస్వాపహారంబుచే అవస్థావిశేషంబు గలుగుచున్నది. గాన అన్నివిధముల బ్రాహ్మణద్రవ్యవిముఖత్వమే ధర్మంబని సూచించెను.

* నృగమహారాజు తిర్యక్త్వమునొందిన గాథ. *

పరమధార్మికుండును వదాన్యశ్రేష్ఠుండును అగు నృగమహారాజు ఒకానొకరోజున నొకబ్రాహ్మణోత్తమునకు తనమందలోని ఒకగోవును దానముచేసెను. ఆపశువు కొంతకాలమాబ్రాహ్మణుని ఇంటనుండి ఎప్పుడో నృగమహారాజుయొక్క ఆలమందలో కలసిపోయినది. ఆయావు ఈమందలో కలసియున్నట్లు రాజుగాని ఆబ్రాహ్మణోత్తముడుగాని ఎరుంగరు. మఱికొంతకాలమునకు దానశీలుండగు నృగమహారాజు ఆయావునే వేరొకవిప్రునకు దానమియ్యగా ఆవిప్రుడు దానిని తనఇంటికి తోలుకొనిపోవుచుండెను. మధ్యేమార్గమున తొలుత నా పశువును దానముగ గ్రహించిన బ్రాహ్మణోత్తముడుచూచి గుర్తించి ఆయావు తనదియని ఆవిప్రునితో వాదించెను. రెండవసారి దానినే దానముగాగ్రహించిన విప్రుడుగూడ రాజు తనకు దానమిచ్చెను గనుక ఆయావు తనదేయని యపవాదం

శ్లో॥ కదాచిదేకాంత ఉపస్థితం ప్రభుం రామం రమాలాలిత
పాదపంకజమ్ । సౌమిత్రిరాసాదితశుద్ధభావనః ప్రణమ్య
భక్త్యా వినయాన్వితో ఽబ్రవీత్ ॥3॥

టీక:_ ఒకానొకసమయంబున విజనప్రదేశంబున సస్వరూపానుసంధానంబు చేయుచున్నవాడును మోక్షలక్ష్మిచే సేవింపబడుచున్న పాదకమలంబులు కలవాడును నగు రామునింజేరి శుద్ధాంతఃకరణంబు (అనగా సాధనసంపత్తి) గల లక్ష్మణుండు భక్తివినయంబులతో నమస్కరించి నమ్రుడై పల్కెను. (దీని చే గురూపసదనప్రకారంబు చెప్పబడుచున్నది.) "తద్విజ్ఞానార్థం సద్గురుమభిగచ్ఛేత్" "శ్రోత్రియం బ్రహ్మనిష్టమ్" అనిశ్రుతియు "తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అని స్మృతులును నుడువుచున్నవి.

శ్లో॥ త్వం శుద్ధబోధోఽసి హి సర్వదేహినామాత్మాస్యధీశోఽసి
నిరాకృతిస్స్వయం । ప్రతీయసే జ్ఞానదృశాం మహామతే
పాదాబ్జభృంగాహితసంగసంగినామ్॥ ౪॥

బొనర్చెను. ఇట్లు వాదోపవాదంబులతో నాయిర్వురును రాజమందిరంబునకేగి ఆయొండొరుల వివాదాంశమును నృగమహారాజునకు విన్నవించిరి. పిదప నా రాజశ్రేష్ఠుండు తన అజ్ఞానకృతజన్యమగు నావివాదాంశమును వివరించి రాజధర్మానుసారియై యథాన్యాయముగ పరిష్కరించెను. అంత దానప్రతిగ్రహీతలగు నాయిరువురు భూసురులునుగూడ బ్రహ్మస్వాపహారంబునకు కినిసి ఆరాజునకు తిర్యక్త్వముగలుగ శపించిరి. ఇచట బ్రాహ్మణద్రవ్యాపహారము అజ్ఞానజన్యమే యైనను పరమధార్మికునకుకూడ పశుత్వము సంపాదించినది. గనుక బ్రాహ్మణద్రవ్యాపహారము ఏవిధముగనైనను దూష్యమేయగును.

టీక:- సర్వవిషయరూపమగు బుద్ధి ఎవనివలన ప్రేరేపింపబడుచున్నదో అట్టి గొప్పబుద్ధిగల ఓరామ! నీవు శుద్ధజ్ఞానస్వరూపుండవును ఆచ్ఛాదనములేని చైతన్యస్వరూపుండవును సర్వజీవులలోను ఆత్మస్వరూపుండవునై ఉండువాడవు. సర్వజీవులను నియమించువాడవు. సర్వరూపుండవు. ఉపాధిభేదంబునలన నేనియాత్మ నియమ్యభావము కలిగెనని తెలియదగినది. యదార్థంబుగ లేదు. కాన స్వయముగ ఆకారరహితుండవే. మాబోంట్లవలె స్వార్జిత కర్మాధీనంబైన శరీరాకృతి లేనివాడవు. అన్నా! రామా! ఇట్టి స్వరూపముగల నీవు జనులందరిచేత ఏల తెలియబడకుంటివి? రామ! వేదాంతవాక్యజన్యమగు జ్ఞానముకలవారికే తెలియబడుచుంటివి. అట్టి జ్ఞానము భక్త్యధీనము. నీచరణకమలము భృంగములవలె నెవరిచే సేవింపబడుచున్నదో తాదృశాంతఃకరణగలవారి సత్సంగులకే (అనగా త్వద్భక్తభక్తులకే) తెలియబడుచుంటివి. కాన త్వద్భక్తభక్తుల ననుసరించుటే ముఖ్యావశ్యకము.

శ్లో॥ అహం ప్రపన్నోఽస్మి పదాంబుజం ప్రభో భవాపవర్గం
తవ యోగిభావితమ్। యథాంజసా జ్ఞానమపారవారిధిం
సుఖం తరిష్యామి తథాఽనుశాధిమామ్॥ ౫॥

టీక: ఓరామ! శీఘ్రకాలముననే జననమరణప్రవాహమునునశింపచేయునదియును యోగులచే సంసారవిముక్తికై భావింపబడునదియునైన నీచరణకమలమును శరణంబునొందియున్నవాడను. కాన సముద్రమునకు ఆవలిగట్టును జూడకపోయినను ద్వీపప్రమాణములచే హద్దునూహించుటయును కలదు. కాని దానికి విరుద్ధమైన, 'అపారము' అనే పదముచే హద్దులేని సముద్రరూపమైన యీజననమరణరూపమగు అజ్ఞానసముద్రము ఊహాతీతము. కాన యీయజ్ఞానసముద్రమును అనాయాసంబుగా దాటగలుగునట్లు శిక్షనువిధించియైనను చెప్పవేడెదను. ఏవిద్యయైనను గురుశిక్షనొందక పట్టుపడదుగదా.

శ్లో॥ శ్రుత్వాఽథ సౌమిత్రివచోఽఖిలం తదా ప్రాహ
ప్రపన్నార్తిహరః ప్రసన్నధీః ।విజ్ఞానమజ్ఞానతమోప్రశాంతయే
శ్రుతిప్రపన్నం క్షితిపాలభూషణః ॥౬॥

టీక:_ క్షితిపాలురందరకు భూషణభూషితుండును ప్రపన్నార్తిహరుండును (అనగా శరణాగతుల సంసారదుఃఖమును తక్షణమపహరించువాడును) నైన రాముండు వినయసంభ్రమభక్త్యుద్రేకములతో సౌమిత్రినుడివిన సమస్తవాక్యలను వినినవాడై తత్వమును గ్రహించుటకు తగినపాత్రుండని యెరింగి "తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి" ఈమొదలగు శృతులచే పొందబడిన ఆత్మతత్త్వమును (అనగా శృతులకు ఫలముగాచెప్పిన విజ్ఞానమును) తమోపశాంతికొరకు ముందుగా సామాన్యముగాజెప్పి తదుపరి అట్టి జ్ఞానప్రాప్తికొరకు క్రమముగా బహిరంగ అంతరంగసాధనములను చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆదౌ స్వవర్ణాశ్రమవర్ణితాః క్రియాః కృత్వా
సమాసాదిత శుద్ధమానసః । సమాప్య తత్పూర్వముపాత్తసాధన
స్సమాశ్రయేత్సద్గురుమాత్మలబ్ధయే॥ ౭॥

టీక:_ అహంకారమనగా అభిమానంబనియు శుద్ధాహంకారము, కుత్సితాహంకారముఅని ఆ అహంకారము రెండువిధములనియు శుద్ధాహంకారంబు నీటియందు గీచినగీతవంటిదనియు కుత్సితాహంకారంబు నేలనుగీచిన గీతవంటిదనియు రామకృష్ణపరమహంస నుడివెను. "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాదనుష్ఠితాత్। స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥" అని కృష్ణభగవానుడును బోధించెను. గాన లక్ష్మణా! జీవాభిప్రాయములు వేరైనను, అవతారాభిప్రాయములన్నియు నొకటియేను. శుద్ధాంతఃకరణములేనిది కుంజరశౌచమువలె వ్యర్థమగును. గనుకను శమదమాదివైరాగ్యములు దృఢమగువరకును శాస్త్రములచే చెప్పబడిన నిత్యనైమిత్తిక యజ్ఞదానాదిరూపమగు కర్మనేచేయుమని సూచితమగు

చున్నది. కనుక తొలుత నీవు శుద్ధాంతఃకరణమును శుద్ధాంతఃకరణంబుచేగలుగు శమదమాదులును కలవాడవై తదుపరి కర్మను విడువుము. తన వ్యుత్పత్తిబలంబుచే మహావాక్యవిచారణము చేసినను ఫలోన్ముఖత్వము కలుగదని సూచింపబడినది. గాన ఆత్మజ్ఞానమునకు ఫలమైన తత్త్వమసిఇత్యాది మహావాక్యవిచారణంబుకొరకు "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం సద్గురుమేవాభిగచ్ఛేత్" ఈ మొదలగు లక్షణములతో గూడిన గురువునే ఆశ్రయింపుము.

శ్లో॥ క్రియా శరీరోద్భవహేతు రాదృతా ప్రియాప్రియౌ
తౌ భవతస్సురాగిణః। ధర్మేతరౌ తత్ర పున శ్శరీరకం
పునఃక్రియా చక్రవదీర్యతే భవః ॥౬॥

టీక:_ సంసారము చక్రమువలెతిరుగు స్వభావముకలదియని చెప్పబడినది. దాని నివృత్తికి కారణమైన అజ్ఞాననాశనపూర్వకముగా తత్త్వజ్ఞానము సాధించుటయు, దానిని సాధించుకొరకు వేదాంతవిచారణయు, విచారణమునకు గురువును అత్యావశ్యకమైయుండెను. పూర్వజన్మార్జితములగు కర్మంబులే ఈజన్మను గలిగించుటకు హేతువులు. విషయాభిలాషగల పురుషునకు ధర్మాధర్మములు రెండును ప్రియాప్రియములైన సుఖదుఃఖముల కలిగించుచున్నవి. ఆ కారణంబున జన్మవలన తిరిగి కర్మయును, కర్మవలన తిరిగి జన్మయును మరల కలుగుచునేయున్నవి.

శ్లో॥ అజ్ఞానమేవాస్య హి మూలకారణం తద్ధానమేవాత్ర
విధౌ విధీయతే। విద్యైవ తన్నాశవిధౌ పటీయసీ న
కర్మ తజ్జం సవిరోధమీరితమ్॥ ౬॥

టీక:_ జన్మనాశనమునకు కర్మసాధనము కాదా అను శంకానివృత్తి చేయబడుచున్నది. ఆ జన్మమునకు అజ్ఞానమే కారణము. సంసారనివృత్తికి ఆ అజ్ఞాననాశనరూపమైన జ్ఞానమే సమర్ధతగల సాధనమనియు "అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్ది నిర్మలమ్। కృత్వా జ్ఞానం స్వయం నశ్యేజ్జలం కతకరేణువత్"

"గీ॥ స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే సంశయంబువిడదు సాధకులకు। చిత్రదీపము నను చీకటిచెడనట్లు విశ్వదాభిరామ వినురవేమ" అనునట్లు సూర్యోదయమైనంతనే తమంబునశించురీతిని జ్ఞానోదయమునసే సమూలముగ అజ్ఞానజనితమగు జన్మ జ్ఞానముననే నశించును. కాని సహజమిత్రత్వమును బొందియున్న జన్మ కర్మములు రెండును విరోధంబులేనివగుటచే నొకదానివలననొకటి నశింపవు. నాశనముచేయు సామర్థ్యంబుగల జ్ఞానమే జన్మను నశింపచేయునుగాని, కర్మంబు జన్మను ఇసుమంతయు నశింపచేయచాలదు.

శ్లో॥ న జ్ఞానహానిర్న చ రాగసంక్షయో భవేత్తతః కర్మ
సదోషముద్భవేత్ । తతః పునస్సంసృతిరప్యవారితా
తస్మాద్బుధో జ్ఞానవిచారవాన్ భవేత్ ॥ ౧౦॥

టీక:_ అందువలననే కర్మచేతను అజ్ఞాననాశనముగాని, రాగనాశనముగాని కాదు. కర్మానుష్ఠానమువలన తిరిగి దోషములతోగూడిన నాశఫలత్వముగల కర్మయే యుద్భవించుచున్నది. దానివలన జన్మమును, జన్మంబువలన కర్మయును కలుగునేకాని ముక్తిబొందు నాశయేలేదు. గాన వివేకవంతులందరును జ్ఞానోదయంబునకై వేదాంతవాక్యవిచారపరులు గావలయునని అభిప్రాయము.

శ్లో॥ యథా హి పురుషో భారం శిరసా గురుముద్వహన్।
తం స్కంధేన స ఆధత్తే తథా సర్వాః ప్రతిక్రియాః॥

శ్లో॥ నైకాంతతః ప్రతీకారః కర్మాణాం కర్మ కేవలమ్।
ద్వయం హ్యావిద్యకశ్శ్రుతం స్వప్నే స్వప్న ఇవానఘ॥

శ్లో॥ అర్థేహ్యావిద్యమానేపి సంసృతిర్న నివర్తతే ।
మనసా లింగరూపేణ స్వప్నే విచరతో యథా॥

శ్లో॥ అథాత్మనోఽర్థభూతస్య యతో నర్థపరంపరా ।
సంశృతిస్తద్వ్యవచ్ఛేదో భక్త్యా పరమయా గురౌ॥

శ్లో॥ వాసుదేవే భగవతి భక్తియోగస్సమాహితః ।
సధ్రీచీనేన వైరాగ్యం జ్ఞానం చ జనయిష్యతి॥

(భాగవతము చతుర్థ స్కంధము అ. 29.)

టీక:_ దుఃఖమునకు ప్రతీకారమేలేదు. ఒక్కజ్ఞానంబుననే దుఃఖనాశనంబు కలుగుచున్నది. ఒకవేళ ప్రయత్నంబుచేసినను ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతిక దుఃఖంబులలో నొకటైనను నశించుటలేదు. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనునట్లు మనోధర్మంబు దుఃఖరూపంబుగాన ఏకాంతనిష్ఠతోఁగూడిన ధ్యానంబుచే దుఃఖనాశనంబుగలిగి సుఖంబు గలుగుచున్నదనిన అట్లుగాదని చెప్పుచున్నాడు. కర్మంబువలనగలు సుఖంబును ఇట్టిదని నుడువుచున్నాడు. దుఃఖశాంతికొఱకు జ్ఞానరహితమగు వాసనారూపమయిన సమస్త కర్మంబులును ఆచరించుట గొప్పదైనభారమును మోయు బాటసారి శిరమునుండి బరువునుదించి భుజముపై నింపుకొనుటవంటిది. ఏకాంతనిష్ఠయును నట్టిదే. దేనినుండియు శాంతిగలుగదు. స్వప్నమున మఱియొకస్వప్నమునుగాంచిన మనుజునకు మెలకువ కలుగునంతవరకును శాంతిసుఖములెట్లులేవో యటులనే లేని మాయాస్వరూపంబుచే కలిగినట్లుగా భాసించిన జన్మకర్మంబులును జ్ఞానంబులేమిచే ప్రకాశించు అనర్థపరంపరలును గురురూపుండైన వాసుదేవుని సంబంధమైన కేవల భక్తిపూర్వకమగు వైరాగ్యమిళితజ్ఞానంబు దృఢముగ కలుగునంతవరకును నశింపవు.

శ్లో॥ నను క్రియా వేదముఖేన చోదితా యథైవ విద్యా
పురుషార్థసాధనమ్ । కర్తవ్యతా ప్రాణభృతః
ప్రచోదితా విద్యా సహాయత్వముపైతి సా పునః॥ ౧౦॥

టీక:_ ఇప్పుడు ఒక్క జ్ఞానమునకే మోక్షహేతువును జ్ఞానాపేక్షారకు జ్ఞానకర్మసముచ్చయవాదము (అనగా జ్ఞానకర్మలకూడికవలననే ముక్తికలుగునను శంక) వారించబడినది. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అను శ్రుతిపురాణలక్షణముచే జ్ఞానము పురుషార్థసాధనముగా చెప్పబడినది. అలాగుననే "యథా ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః తథా జ్ఞానకర్మాభ్యాం బ్రహ్మ శాశ్వతమ్" ఈ మొదలగు శ్రుతులచేతను కర్మంబు జ్ఞానసాధనముగా చెప్పబడినను నిత్యనైమిత్తికకర్మలు ఆవశ్యకముగా చేయతగినవనియు చేయనిచో ప్రత్యవాయమనియు చెప్పబడినదేగాని జ్ఞానోత్పత్తి ఏమాత్రము చెప్పబడలేదు. అందువలన ఘటోత్పత్తియందు దండచక్రాదులు సహకారులగుచున్నట్లు ఈశ్వరార్పణముగాచేయబడిన కర్మమాత్రమే జ్ఞానసహాయత్వమును పొందుచున్నది.

శ్లో॥ కర్మాకృతౌ దోషమపి శ్రుతిర్జగౌ తస్మాత్సదా
కార్యమిదం ముముక్షుణా। నను స్వతంత్రా
ధ్రువకార్యకారిణీ విద్యా న కించిన్మనసాఽప్యపేక్షతే॥౧౨॥

టీక:_ కర్మ అవశ్యకముగా చేయతగినది అని చెప్పబడిన శ్రుతినికూడ శంకించి వివరించుచున్నాడు. "యావజ్జీవం అగ్నిహోత్రం కుర్యాత్" అను ఈశ్రుతి మోక్షేచ్ఛునిచే నిత్యము ఈకర్మ చేయదగినదనియు చేయనిచో దోషంబు నుడివినను స్థిరమైనపురుషార్థమునిచ్చు జ్ఞానము తమోనివర్తకమగు తేజమువలె ఏయితరసహాయములేకయే విద్యకు ఫలమగుమోక్షమును గలుగజేయుచున్నదనియు దెల్పుచున్నాడు.

శ్లో॥ స సత్యకార్యోఽపి హి యద్వదధ్వరః
ప్రకాంక్షతేన్యానపి కారకాదికాన్। తథైవ విద్యావిఘాతః
ప్రకాశితైర్విశిష్యతే కర్మభిరేవ ముక్తయే॥ ౧౩॥

టీక:_ "అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి" అనుదానిచే వేదమునందు చెప్పబడిన స్థిరమగు కార్యమైన యజ్ఞముకూడ ఇతర

కారకములగు దేశకాలములను కోరునట్లుగా స్వవర్ణాశ్రమములకు నుచితములగు కర్మంబులనేకోరి జ్ఞానము ప్రకాశించుచున్నది.

శ్లో॥ కేచిద్వంతీతి వితర్కవాదిన స్తదప్యసద్దృష్ట
విరోధకారణాత్ । దేహాభిమానా దభివర్ధతే క్రియా
విద్యాగతాహంకృతితః ప్రసిద్ధ్యతి॥ ౧౮ ॥

టీక:_ సిద్ధాంతము చేయబడుచున్నది. జ్ఞానకర్మంబులు రెండునుకలసి ముక్తికి సాధనములని కొందరుచెప్పు సముచ్చయవాదమును అబద్ధమేను. కేవలము కర్మంబే మోక్షకారణంబని చెప్పునదియును నబద్ధము. మోక్షకారణంబనుటకు హేతువు నెవరును నెరుగకుండుటవలన దేహాభిమానంబుననే క్రియయు వృద్ధి నొందును. అనాత్మరూపమగు దేహమునందు ఆత్మబుద్ధియే క్రియావృద్ధికరంబు. నాశంబునొందిన అహంకృతియే జ్ఞానంబుగాన. "అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్ । కృత్వా జ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతకరేణువత్" క్రియాజ్ఞానంబులు రెండును అహంకారమూలకంబులగుటచే కేవలమోక్షసాధకంబులుగాక నశింపవలసినవే.

శ్లో॥ విశుద్ధవిజ్ఞానవిరోచనాంచితా విద్యాత్మవృత్తిశ్చరమేతి
భణ్యతే । ఉదేతి కర్మాఖిలకారకాదిభి
ర్నిహంతి విద్యాఽఖిలకారకాదికమ్॥ ౧౯॥

టీక:_ పూర్వపక్షిచేచేయబడు అనుమానములను దూషించుచు జ్ఞానస్వరూపము చెప్పబడినది. విశుద్ధాంతఃకరణగలవారు వేదాంతవాక్యవిచారణము విశేషముగా జేయుటవలన బొందు.చరమాత్మవృత్తి (అనగా బ్రహ్మాకారాంతఃకరణవృత్తి) యేవిద్వాంసులచే విద్యయని చెప్పబడుచున్నది. తిరిగి సముచ్చయవాదమును నిరాకరించుకొరకు కర్మజ్ఞానములయొక్క భేదము జూపబడినది. యజ్ఞాదిరూపంబగు సమస్తకర్మంబును చేయదగినదగుచు నెట్టకేలకు ఫలోత్కర్షం

బగుచున్నది. విద్యయైనచో సమస్తసాధనములను నశింపచేయుచున్నది. సకల వాసనాపరిత్యాగమే శుద్ధజ్ఞానము. (అనగా బ్రహ్మప్రాప్తియే.) సత్ జ్ఞానమునకు చిత్తశుద్ధి కారణము. చిత్తశుద్ధికి కారణము కర్మ, అను పూర్వపక్షశంకకు సిద్ధిలేదు.

శ్లో॥ తస్మాత్త్యజేత్కార్యమశేషతస్సుధీర్విద్యావిరోధాన్న సముచ్చయో భవేత్ । ఆత్మానుసంధానపరాయణస్సదా నివృత్తసర్వేంద్రియవృత్తిగోచరః ౧౬॥

టీక:_ ప్రారంభింపబడిన జ్ఞానకర్మలయొక్క గోష్ఠిని నుపహరింపుచు మోక్షేచ్ఛగల పురుషునకు నుండవగిన వృత్తిలక్షణము చెప్పబడినది. విద్య కర్మంబుతో విరోధంబుకలదిగుటచే ఆరెంటికిని సంఘీభావము సంభవింపదు. గాన మోక్షేచ్ఛగల బుద్ధిమంతుడు సంపూర్ణముగా కర్మఫలత్యాగంబుచేయవలెను. కామ్యకర్మంబు నిశ్శేషముగా విడువవలెను. నిత్యనైమిత్తికకర్మంబు చిత్తశుద్ధి పర్యంతమే కాక బ్రహ్మయందు చిత్తస్థైర్యము కలుగుపర్యంతమును చేయవలయును. పిదప కర్మానుసంధానము ప్రతిబంధకము గాన ప్రయోజనంబు లేమిచే విడువవలయునని భావము. ఇప్పుడు ముముక్షువునకు ముఖ్యకర్తవ్యము చెప్పబడినది. సర్వేంద్రియములను మరల్చుకొనినవాడై మనస్సునకు సచ్చిదానందమే లక్షణంబు గాన బ్రహ్మానుసంధానకుండు గావలెను.

శ్లో॥ యావచ్ఛరీరాదిషు మాయయాఽత్మధీ స్తావద్విధేయో విధివాదకర్మణామ్ । నేతీతివాక్యైరఖిలం నిషిధ్య తద్జ్ఞాత్వా పరాత్మాన మథ త్యజేత్క్రియాః॥ ౧౭॥

టీక:_ కర్మాచరణంబు రాగవిరాగంబులను భేదంబులుగలది గాన ఆ భేదంబులుగలమనుజులకు జేయతగినదానిని చెప్పుచున్నాడు. మాయారూపమైన అవిద్యచే శరీరము మొదలగు అనాత్మలయందు నేను జేయువాడనను కర్త్రాభిమానమున్నంతవరకు కర్మంబులను జేయవలయునను విధికి వశుండైయుండవల

యును. "తస్మాదహంకారమిమం స్వశత్రుం భోక్తుర్గళే కంటకవత్ప్రతీతమ్ । విచ్ఛిద్య విజ్ఞానమహాసినా స్ఫుటం భుఙ్క్ష్వాత్మసామ్రాజ్యసుఖం యథేష్టమ్" (భుజించువానికంఠమున గ్రుచ్చుకొన్న ముల్లువలెనుండు నీకు శత్రువగు ఈ అహంకారమును విజ్ఞానమనే వాడియగు కత్తిచే నిర్మూలముగ ఛేదించి ఆత్మసామ్రాజ్యసుఖమును యథేష్టముగ ననుభవింపుము.) ఆ దేహాభిమానంబులేనివాడు సమస్తజగత్తు మిథ్యాత్వముగా ఎరిగి "నేతి నేతి" (ఇది పరమాత్మ కాదు ఇది పరమాత్మ కాదు.) అని పంచకోశంబులతో గూడిన దేహంబును మిథ్యగా నిరశించి జగత్తునకు విలక్షణముగాను, సత్యరూపంబుగాను ప్రకాశించు పరమాత్మస్వరూపంబును రూఢిగా తెలిసినపిదప పరమాత్మనిష్ఠుండైనవాడే సమస్తకర్మంబును పరిత్యాగంబుచేయవలయునేగాని తదన్యుడు కర్మత్యాగముచేయ నర్హుడు కాడు.

**శ్లో॥ యదా పరాత్మాత్మవిభేదభేదకం విజ్ఞానమాత్మన్యవభాతి భాస్వరమ్ । తదైవ మాయా ప్రవిలీయతేఽంజసా సకారకా కారణమాత్మసంసృతేః॥ ౧౭॥**

టీక:_ ఆత్మజ్ఞానముకలవానికి అజ్ఞానము నశించునని చెప్పుచున్నాడు. శుద్ధాంతఃకరణయందు పరమాత్ముండైన ఈశ్వరునకును ఆత్ముండైన జీవునకును ఏభేదము మాయాంతఃకరణోపాధులచే గలుగుచున్నదో ఆభేదమును నశింపజేయునదియును ప్రకాశస్వభావము గలదియును ఇతరవృత్తులను నశింపజేయునదియునునై సమర్థతగల బ్రహ్మాకారాకారితవృత్తి యెప్పుడు సిద్ధించునో అప్పుడు అసంభావనలను నశింపజేయుచు ఆత్మ ప్రకాశించును. అప్పుడే అనేకజన్మంబులను బొందించు మాయ కర్మలతోసహా శీఘ్రముగనే నశించుచున్నది.

**శ్లో॥ శ్రుతిప్రమాణాభివినాశితా చ సా కథం భవిష్యత్యపి కార్యకారిణీ । విజ్ఞానమాత్రాదమలాద్ద్వితీయతస్తస్మాదవిద్యా న పునర్భవిష్యతి॥ ౧౮॥**

టీక:_ చెప్పినయర్థమునే తిరిగి దార్ఢ్యముకొఱకు చెప్పుచున్నాడు. "సత్సంగలబ్ధయా భక్త్యా యదా త్వాం సముపాసతే। తదా మాయా శనైర్యాతి తానవం ప్రతిపద్యతే" అ॥ రా॥ బా॥ తొలుత సత్సంగముననే మాయ మెల్లిగా జారి నాశనమునొందుచున్నది. తత్త్వమసీత్యాది శ్రుతిరూపంబులగు ప్రమాణంబుల వలన నుద్భవించిన జ్ఞానంబుచే నశించిన మూలాజ్ఞానము జన్మను గలిగించుటయందు ఏవిధంబుగనైనను సమర్థమైనది కాదు. "యా మా సా మాయా" (ఏది లేదో అది మాయ) అట్టి అభావరూపమగు మాయచే జగత్సృష్టి అసంభవము. తిరిగి మాయోద్భవముగూడ అసంభవమేను. శుద్ధమును, అద్వితీయమును అగు ఆత్మవిషయమగు జ్ఞానము ఇతరసహకారులగు నిదిధ్యాసనాదులచే పరిపాకమునొంది మూలాజ్ఞానమును నశింపచేయును. గాన తిరిగి ఆ అజ్ఞానముద్భవింపదు. త్రాడని తెలియకపూర్వము భాసించినపాము త్రాటిని విచారించినపిదప ఎట్లు భాసింపదో నటులనే స్వరూపవిచారణానంతరము భ్రాంతిజ్ఞానము నిలువదు.

**శ్లో॥ యది స్మ నష్టా న పునః ప్రసూయతే కర్తాఽహమస్మీతి**
**మతిః కథంభవేత్ । తస్మాత్స్వతంత్రా న కిమప్యపేక్షతే**
**విద్యా విమోక్షాయ విభాతి కేవలా॥ ౨౦॥**

టీక:_ అన్యాపేక్షారహితమైన విద్యయే ముక్తికి కారణంబనిచెప్పి శ్రోతల దార్ఢ్యముకొఱకు తిరిగి యుక్తిపూర్వకముగ చెప్పుచున్నాడు. తత్త్వజ్ఞానముచే నశించిన మూలావిద్య తిరిగి పుట్టదు. అప్పుడు కారణభూతమగు అవిద్యలేనందున అహంబుద్ధికి నునికియేలేదు. గాన అహంబుద్ధ్యభావమున కర్తృభావము గలుగదు. స్వఫలమోక్షోత్పత్తియందు జ్ఞానము స్వాతంత్ర్యముగలదియై యుండును. [illegible] వస్తువు లేదుగాన కేవలమైన విద్యయే ఇతరసహాయరహితమై మోక్షముకొఱకు ఫలవత్తమై ప్రకాశించుచున్నది.

**శ్లో॥ సా తైత్తిరీయశ్రుతి రాహ సాదరం న్యాసం ప్రశస్తాఖిల**
**కర్మణాం స్ఫుటమ్ । ఏతావదిత్యాహ చ వాజినాం శ్రుతి**
**ర్జ్ఞానం విమోక్షాయ న కర్మసాధనమ్॥ ౨౧॥**

టీక:_ ఈ అర్థమునందు శ్రుతిప్రమాణమును జూపుచున్నాడు. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వమానశుః" ఇత్యాదికమైన తైత్తిరీయ శ్రుతి ప్రశస్తముగా అర్థవాదములచే చెప్పబడిన కర్మత్యాగంబునే ఆదరణముతో నుడువుచున్నది. మోక్షమునకు కర్మ సాధనంబు కాదనియు, జ్ఞానమే సాధనమనియు వాజసనేయశ్రుతియు చెప్పుచున్నది. "పాకస్య వహ్నివత్ జ్ఞానం వినా మోక్షో నసిధ్యతి । బోధోఽన్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షైకసాధనమ్" అగ్ని లేనిదే పచనమెట్లు కాదో అట్లే సాక్షాత్ జ్ఞానంబు మోక్షైక కారణము.

శ్లో॥ విద్యా సమత్వేన తు దర్శిత స్త్వయా క్రతు ర్నదృష్టాంత ఉదాహృత స్సమః । ఫలైఃపృథక్త్వాద్బహుకారకైః క్రతు స్సంసాధ్యతే జ్ఞానమతో విపర్యయమ్॥ ౨౨॥

టీక:_ సాహంకారంబగు కర్మంబునకు నిరహంకారంబగు జ్ఞానంబునకును గల భేదంబును నుడివి తత్ఫలంబునకుగల భేదంబును చెప్పుచున్నాడు. ఓ సముచ్చయవాదీ! అగ్నిష్టోమాదిక్రతువు విద్యాతుల్యంబుగా చెప్పి సమానంబగు దృష్టాంతమును నుడువనైతివి. ఆ కారణంబుచే శ్రుతిబోధితమగు కర్తృత్వముగల కర్మ విద్యాసమంబనునది నిరశింపబడినది. విద్యాకర్మంబులు సమంబన్నను ఫలోన్ముఖంబున దండచక్రాదులవలె అహంమమతాభిరూప అంతర బాహ్యదేశ కాల నియమంబులగూడు కర్మంబునకును, జ్ఞానంబునకును ఆద్యంతములయందును వ్యత్యాసంబు గలదు.

శ్లో॥ సప్రత్యవాయో హ్యహమిత్యనాత్మధీరజ్ఞప్రసిద్ధా న తు తత్త్వదర్శినః । తస్మాద్బుధైస్త్యాజ్య మవిక్రియాత్మభిర్విధానతః కర్మవిధిప్రకాశితమ్॥ ౨౩॥

టీక:_ కర్మచేయనిచో ప్రత్యవాయదోషంబు గలుగునను భయంబున కర్మచేయువానింగూర్చి చెప్పుచున్నాడు. కర్మత్యాగంబుచే నాకు ప్రత్యవాయదోషంబు గలుగగలదు అను బుద్ధి తత్త్వజ్ఞానంబులేని అజ్ఞులకే గలుగుచున్నది. పాపత్వబుద్ధిచే ఫలమునందు ఆసక్తిగల మనుజులకే కర్మ ముఖ్యముగా చేయదగినదని విధియుక్తము. ఫలాసక్తిలేని మనుజులు తత్త్వవిచారణకొరకు కర్మవిడువతగినదేనని యర్థము.

శ్లో॥ శ్రద్ధాన్విత స్తత్త్వమసీతి వాక్యతో గురోః
ప్రసాదాదపి శుద్ధమానసః। విజ్ఞాయ చైకాత్మ్య
మథాత్మజీవయో స్సుఖీ భవేన్మేరురివాప్రకంపనః॥ ౨౮॥

టీక:_ విరక్తుండైనవానికి చేయదగు కార్యమును చెప్పుచున్నాడు. ఎవడు గురుశాస్త్రములందు విశ్వాసముగలవాడై నిష్కామకర్మానుష్ఠానంబుచే శుద్ధమైన మనస్సుగలవాడై గురువుయొక్క అనుగ్రహంబునొంది తత్త్వమసీతివాక్యంబులచె నిదిధ్యాస మొదలగు పరిపాకవశంబున పరమాత్మజీవాత్మలకు ఏకత్వంబు సాక్షాత్కరింపగలడో వాడే సకలదుఃఖవిరహితుండై చలింపని పర్వతమువలె బ్రహ్మస్వరూపస్థితుండై యుంటున్నాడు.

శ్లో॥ ఆదౌ పదార్థావగతిర్హి కారణం వాక్యార్థవిజ్ఞానవిధౌ
విధానతః। తత్త్వంపదార్థౌ పరమాత్మజీవకా వసీతి
చైకాత్మ్యమథానయోర్భవేత్॥ ౨౯॥

టీక:_ ముందుగా "తత్త్వమసి" అను వాక్యములోని మూడుపదముల సమన్వయార్థమును తెలిసికొన్నవానికే ఆ మహావాక్యముయొక్క పరిపూర్ణభావము తెలియనగునని చెప్పుచున్నాడు. ముందుగా "తత్త్వమసి" అను వాక్యములోని మూడుపదములను గ్రహించి 'తత్' అను పదమునకు సర్వజ్ఞత్వాది

గుణములుగల పరమాత్మ అనియు, 'త్వం' అను పదమునకు జీవుడనియు, 'తత్ త్వం' అను పదములకు ఏకత్వమే ఆత్మనుబోధించునది 'అసి' పదమనియు తెలియవలెను.

శ్లో॥ ప్రత్యక్పరోక్షాదివిరోధమాత్మనో ర్విహాయ సంగృహ్య
తయో శ్చిదాత్మతామ్ । సంశోధితాం లక్షణయా చ
లక్షితాం జ్ఞాత్వా స్వమాత్మాన మథాద్వయో భవేత్ ॥ ౨౬

టీక:_ సర్వజ్ఞత్వాదిగుణంబులుగల ఈశ్వరునకు కించిద్జ్ఞత్వాదిగుణంబులుగల జీవునితో నేకత్వంబెట్లు సిద్ధించుననిన చెప్పుచున్నాడు. అహంబుద్ధిచే తెలియనగు ప్రత్యక్త్వమగు (అనగా ప్రతికూలముగా ప్రకాశించు జీవధర్మమును పరోక్షత్వమగు ఈశ్వరధర్మమును) అది ఇది అను ధర్మములచే పొందబడిన పరమాత్మ జీవాత్మలయొక్క భేదమునువిడచి యుక్తులచే భేదమును విచారణ చేయవలెను. "తత్ త్వం" అను పదముల తెలిసికొనుశక్తి లేకపోయినను చెప్పబోవు ప్రకారము లక్షణముచే లక్షితమైన చిదాత్మత్వమును గ్రహించి అనగా "తత్ త్వం" అను రెండుపదములకు స్థితియగు స్వరూపమును ఆత్మగా తెలిసికొని పిదప చిత్స్వరూపమును పొందినవానివలె అద్వితీయుండగుచున్నాడు. పూర్వము సద్రూపుండైనను విస్మృతకంఠగతచామీకరన్యాయముగా స్వరూపప్రాప్తిని బొందితినని ఆనందించుచున్నాడు. 'తత్ త్వం' అను పదములకు వాచ్యార్థమనియు, లక్ష్యార్థమనియు రెండర్థంబులు గలవు. తత్పదమునకు సర్వజ్ఞత్వాదులతోగూడిన మాయోపాధియే వాచ్యార్థము. "త్వం" పదమునకు కించిద్జ్ఞత్వాదులతోగూడిన మాయాకార్యమగు అవిద్య అనగా అంతఃకరణోపాధియే వాచ్యార్థము. జీవేశ్వరులకు ఉపాధిభేదంబున వాచ్యార్థంబునకు ఏకత్వంబు లేకున్నను లక్ష్యార్థంబున ఏకత్వంబు సిద్ధించుచున్నది.

శ్లో॥ ఏకాత్మకత్వా జ్జహతీ న సంభవే త్తథాఽజహల్లక్షణతా
విరోధతః। సోఽయం పదార్థా వివభాగలక్షణా యుజ్యేత
తత్త్వంపదయో రదోషతః॥ ౨౭॥ *

టీక:_ చెప్పినదాని లక్షణస్వరూపమును చెప్పుచున్నాడు. ఒకే ఆత్మ స్వరూపంబుగాన ఏలక్షణచేనైనను బొందునదిగాదని "గంగాయాం ఘోషః

* విశేషము:_ జహల్లక్షణ యనగా శబ్దార్థమును విడచిన లక్షణార్థము జెప్పుటయు, అజహల్లక్షణయనగా శబ్దార్థమును విడువని లక్షణార్థమనియు, జహదజహల్లక్షణ యనగా శబ్దార్థమును విడచివిడువని లక్షణార్థమనియు చెప్పబడును. వీనిని లక్షణావృత్తి యని కూడా చెప్పుదురు. అనగా ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరముగాని వస్తువును ఏలాగైనను గ్రహించునట్లు వేరొక మార్గముగా బోధించుదానికి లక్షణావృత్తి యని పేరు. అందు జహల్లక్షణా స్వరూపము ఎట్టిదనగా "గంగాయాం ఘోషః" (గంగలో గోల వినవచ్చుచున్నది) ఒకబాటసారి ఒక గృహస్థునింటికి వచ్చెను. ఆ గృహస్థుడు అతిథి సత్కారములు చేయుచు భోజనాదులు చేసినవెనుక ఆయనను పాన్పుపై పరుండబెట్టి పాదములొత్తుచు ఇట్లు ప్రశ్నించెను. హే సాధుసత్తమా మీరు వచ్చు మార్గమున విశేషములేవి యని యడుగగా అతిథి ఇట్లు చెప్పుచున్నాడు. "గంగాయాం ఘోషః" నేను వచ్చుమార్గమున గంగలో గోల వినవచ్చుచున్నది అని చెప్పి అతిథి నిద్రించెను. పిండియు గృహస్థుడు ఆ ఒక్క శబ్దమునకు అర్థమును గ్రహించుకొనలేక గంగలో గోల యెట్లు వినవచ్చును యని సందేహించి. అది ఏదియో చూచెదనుగాక యని ఆ మార్గముగా పోయి పరీక్షించగా గంగ ఒడ్డున గొల్లపల్లె గలదు. అందు గోల వినవచ్చుచున్నది అని తెలిసికొనెను. దీనిచే గంగను విడచి తత్తీరమునగల గొల్లపల్లెలో గోల గ్రహింపబడుటచే దీనికి జహల్లక్షణ యనియు, విడచిన లక్షణయనియు చెప్పబడినది. అట్లుగనే తత్పదవాచ్యార్థ స్వరూపుడగు జీవుని గ్రహించుటలో దేహేంద్రియమనఃప్రాణాదులను విడచి

వసతి” అను వాక్యమునందు ‘గంగాయాం’ అను ఒకపదార్ధమును విడచి తీరే అను పదమును పొంది వేరొక తీరపదార్ధమును గ్రహించినచో జహల్లక్షణమనియు “కాకేభ్యో దధిరక్ష్యతాం” అను ఈవాక్యమునందు ఏపదార్ధంబును విడువకయే వేరొక అర్ధంబు గ్రహించిన అజహల్లక్షణమనియును విశేషణంబుల విడచినను

వేసి దీనికి సాక్షియగు ఆత్మనుగా గ్రహించుటకు వాచ్యార్ధమును విడచి వేసి లక్ష్యణార్ధమునే గ్రహింపవలెను. సంఘాతమునకువినాగా ఆత్మను బైటచూపుటకు బ్రహ్మాదులుకూడ శక్యులుగారు. సరిగదా శృతికూడ అట్లు చెప్పజాలకయే యీ సంఘాతమునందు తటస్థలక్షణముచేమాత్రము ఆత్మదేవుని శృతిభగవతి కథనము చేయుచున్నది. ముఖ్యలక్షణముచే ఎప్పుడు కథనముచేయబడదు. (దృష్టాంతము) శ్లో॥ జీవ శ్శివ శ్శివోజీవ స్సజీవః కేవలశ్శివః। తుషేణ బద్ధో వ్రీహిస్స్యా తుషాభావేన తండులః ఏవం బద్ధస్తదా జీవః కర్మనాశే సదా శివః॥ పాశబద్ధస్తదా జీవః పాశముక్తస్తదా శివః॥ అను స్కందోపనిషద్వాక్యరీతిగా ధాన్యాదులు పొట్టుచే కప్పబడియున్నంతవరకు వ్రీహ్యాదులనియు, పొట్టుచే విడివడినవెనుక తండులము లనియు చెప్పబడునట్లు ఆశాపాశముచే బంధింపబడినపుడు జీవుడనియు, అట్టి పాశములచే విడువడినపుడు దేవుడనియు చెప్పబడును. గాన ధాన్యాదులు వినాగా బియ్యము లేనట్లును, నువ్వులు వినాగా నూని లేనట్లును వ్యవహారగీతముగా చెప్పబడిన జీవుని విడచివేసి బైటనెక్కడనో దేవుని గాంచలేరు. ఇక అజహల్ల క్షణస్వరూపమెట్టిదనగా ఇది విడువనిలక్షణము. ఒకబాటసారి వేరొకగృహస్థుని యింటికి వచ్చెను. ఆ గృహస్థుడు ఆ బాటసారిని సత్కరించి భోజనాదులు పెట్టినవెనుక ఆయనను పాన్పుపై పరుండచేసి పాదములొత్తుచు కుశలప్రశ్న పూర్వకముగా ఇట్లడిగెను. హే సాధుసత్తమా! మీరువచ్చుమార్గమునందుగల విశే షములెవ్వియో సెలవీయుడు యని యడుగగా ‘మంచాః క్రోశన్తి’ నేను వచ్చు మార్గమున మంచెలు మాట్లాడుచున్నవని చెప్పి ఆయన నిద్రించెను. గృహస్థుడు అట్టివాక్యమునందు సందేహముగలవాడై జడమగు మంచెలు మాట్లాడుట ఎట్లని

స్వరూపత్యాగంబు గాదుగాన "సోయం దేవదత్తః" అను విషయమునందు తత్పదమునకు అర్థమగు ఆ దేశకాలరూపంబులను ఇదంశబ్దార్థమయిన ఈదేశ కాలరూపవిశేషంబులను విడచినచో వాడే వీడన్నట్లు ఈవిషయమున ఉపాధుల యొక్క త్యాగంబున భాగలక్షణే తగియున్నదని మూడులక్షణములయొక్క రూపమును బోధింపబడినది.

కొంతదూరమేగి చూడగా మంచెయందు మనుష్యుడు మాట్లాడుచున్నాడని గ్రహించెను. మంచెను విడువకుండగా మనుష్యుని గ్రహించుటవలన విడువని లక్షణయని చెప్పబడినది. అట్లుగనే దేహేంద్రియాది సంఘాతమును విడువ కుండగా ఆత్మను గ్రహింపవలెను. అనగా జడమైన దే హే ం ద్రి య ము లు మాట్లాడుట, యిచ్చుట, పుచ్చుకొనుట మొదలగునని చెల్లవుగాన యిందు అధి ష్ఠానరూపముగానున్న ఆత్మసత్తవలననే సర్వవ్యాపారములు జరుగుచున్నవని గ్రహించుట. ఇదియే 'త్వం'పదవాచ్యార్థముచే ఈశ్వరుడని చెప్పబడినది. వాచ్యార్థముచే 'తత్త్వం'పదములకు ఐక్యము సిద్ధింపకున్నను లక్ష్యార్థముచే సిద్ధించుచున్నది. ఇందులకు 'అసి' పదము భాగత్యాగలక్షణము కావలసివచ్చినది. దీనికి 'సోఽయం దేవదత్తః' యనికూడా చెప్పబడును. అనగా ఆ దేవదత్తుడే యీ దేవదత్తుడు అనుటలో ఆ యీ పదములను వదలివేసి దేవదత్తపదమును మాత్రము గ్రహించిన దేవదత్తుడొకడేగాని యిద్దరులేరు.

దృష్టాంతము:_ ఒకసమయమున దక్షిణదేశమున రామేశ్వరక్షేత్రములో పాతిక సంవత్సరముల వయస్సుగల రంగడనువానిని ధనవంతునిగా నున్నపుడు గొప్పవిలువగల పట్టువస్త్రములు ధరించియుండగా వర్షకాలములో లింగడను వేరొకడు చూచియుండెను. కొంతకాలము జరిగినవెనుక ఉత్తరదేశములో కాశీ క్షేత్రమునందు వేసవికాలములో ఏబది సంవత్సరముల వయస్సుగల ఒకపురుషుని దరిద్రస్థితిలో జీర్ణవస్త్రములు ధరించియుండగా ఈలింగడు చూచెను. అప్పుడు ఆ పురుషుని ఇట్లు ప్రశ్నించెను. ఓ నాయనా! ఆరంగడవే ఈ రంగడవు కావా

శ్లో॥ రసాదిపంచీకృతభూతసంభవం భోగాలయం
దుఃఖసుఖాదికర్మణామ్ । శరీర మాద్యంతవదాదికర్మజం
మాయామయం స్థూలముపాధిమాత్మనః॥ ౨౮॥

టీక:_ విడచుటకొరకు స్థూలోపాధియొక్క రూపమును చెప్పుచున్నాడు. "స్వీకుర్వన్ వ్యాఘ్రవేషం స్వజఠరభృతయే భీషయన్ యశ్చ ముగ్ధాన్ । మత్వా వ్యాఘ్రోహ మిత్థం స నరపశుముఖాన్ బాధతే కిం ను సత్వాన్ । మత్వా స్త్రీవేషధారీ స్త్ర్యహమితి కురుతే కిం నటో భర్తురిచ్ఛాం। తద్వచ్ఛారీర ఆత్మా

యని యడుగగా ఆతడు అట్లే అవునని చెప్పెను. వేరొకరు ఇట్లు ప్రశ్నించిరి. ఆ రంగడే యీరంగడని నీవెట్లు గ్రహించితివి అనగా దేశము, కాలము, పాత్రలు అన్నియు మారినవిగదా. అది యెట్లనగా ఇదివరలో దక్షిణదేశము వర్షకాలము పాతిక సంవత్సరముల వయస్సుగల యౌవ్వనావస్థ విలువగల పట్టు దుస్తులధరించుట గొప్ప ధనవంతుడుగా నుండుట, ఆ సమయములో ఆయనను చూచుట తటస్థించినది. తరువాత ఉత్తరదేశము కాశీక్షేత్రము, వేసవి కాలము, ఏబది సంవత్సరముల వృద్ధావస్థ జీర్ణవస్త్రములు ధరించిన దరిద్రావస్థ యిన్ని మార్పులు చెందియున్నను నీవు ఆ రంగడే యీ రంగడని ఎట్లు గ్రహించినావని యడుగగా ఆయన కంఠధ్వనినిబట్టి గ్రహించినానని చెప్పెను. అలాగున భాగ త్యాగలక్షణము చెప్పుటలోగూడ జాగ్రత్ స్వప్నసుషుప్త్యాది త్రివిధావస్థలు ఒకే దినమున మార్పుచెందుచున్నను ఆత్మమాత్రము వీనికి సాక్షిగా నుండినందున అలాగుననే ఒకే జన్మలో బాల్య, యౌవ్వన, వృద్ధాది అవస్థలు మార్పుచెందు న్ననూ ఆత్మ సాక్షిగా నుండునట్లును, విశ్వ తైజస ప్రాజ్ఞ జీవ చేతనమును వేరుగా విభాగించి అనగా సచ్చిదానందస్వరూపమగు ఆత్మను వేరుగనూ అనృత జడదుఃఖాత్మకమగు దేహేంద్రియమనఃప్రాణాదుల వేరుగనూ విభాగించి జడా దులను త్యాగించి చైతన్యాత్మను వేరుగా అనగా తానుగా తెలియవలెను. దీనికే

పృథగనుభవతో దేహతో యస్స సాక్షీ (వేదాంతకేసరి) ఒకానొక పురుషుండు జీవికకై వ్యాఘ్రవేషంబుదాల్చి ముగ్ధులగు బాలురను భయపరచుచు తాను వ్యాఘ్రంబని తలచి నరపశుమృగంబులను బాధింపడు. మరియు స్త్రీవేషధారి యగు నటుండు తాను స్త్రీయని తలచి భర్తృసంబంధమగు కామంబును కోరడు. అటులనే శరీరధారియగు ఆత్మయు శరీరానుభవముల నంటక దేహమునకంటె విలక్షణముగా ఉండును. అట్టి ఆత్మయే సాక్షి. పంచీకరణముచేయబడిన పంచ మహాభూతములవలన నుత్పన్నమైనదియును సుఖదుఃఖాదిరూపంబులగు కర్మంబుల ననుభవించుటకు స్థానమైనదియును, ఉత్పత్తినాశంబులు కలదియును పూర్వ కర్మంబుచే నుద్భవించుటయును పరంపరగా మాయావికారంబులు కలదియును నగు ఈశరీరమునే ఆత్మకు స్థూలోపాధిగా చెప్పుచున్నారు.

శ్లో॥ సూక్ష్మం మనోబుద్ధిదశేంద్రియై ర్యుతం
ప్రాణైరపంచీకృతభూతసంభవమ్। భోక్తుస్సుఖాదేరను
సాధనం భవేచ్ఛరీరమన్యద్విదురాత్మనోబుధాః॥ ౨౯॥

టీక:_ తరువాతను సూక్ష్మోపాధినికూడ చెప్పుచున్నాడు. చక్షురాదీంద్రి ములకు విషయముగానిదియును సంకల్పాత్మకమైన మనస్సుతోను నిశ్చయాత్మక మైన బుద్ధితోను, శ్రోత్ర త్వక్ చక్షుః జిహ్వా ఘ్రాణంబులను జ్ఞానేంద్రియముల తోడను వాక్ పాణిపాద పాయు ఉపస్థలను కర్మేంద్రియంబులతోను ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన సమానంబులను ప్రాణంబులతోను సప్తదశసముదాయ

లక్షణాత్రయము అనియు, లక్షణావృత్తియనియు చెప్పుదురు. "ఫలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంధమశేషత;" అను న్యాయానుసారముగా కృషీవలుడు ధాన్యాదులను వేరుగను, గడ్డిని వేరుగను విభాగించి ఫలస్వరూపమగు ధాన్యా దులనుమాత్రము స్వీకరించి గడ్డిని ఎట్లు విడచివేయుచున్నాడో అట్లుగనే వివేకి యగువాడు వేదాంతశాస్త్రవిచారణచే జడచేతనముల రెంటిని వేరువేరుగా విభా గించి జడమును త్యజించి చైతన్యాత్మనుమాత్రము గ్రహించుచున్నాడు.

స్వరూపమైనదియును పంచీకరణంబుచేయని పంచభూతోత్పన్నంబుగాన అప్ర శ్వరూపంబును స్థూలంబుతో కలసి సుఖదుఃఖంబు లనుభవించునదియును దీని వియోగంబుచే మరణంబను వ్యవహారంబు కలదియును గాన దీనినే లింగశరీరం బనియును సూక్ష్మశరీరంబనియును చెప్పుదురు.

**శ్లో॥ అనాద్యనిర్వాచ్యమపీహ కారణం మాయా ప్రధానం తు పరం శరీరకమ్ । ఉపాధిభేదాత్తు యతః పృథక్స్థితం స్వాత్మాన మాత్మన్యవధారయేత్ క్రమాత్ ॥ 30॥**

టీక:_ జీవోపాధిద్వయంబును చెప్పి ఈశ్వరోపాధిని జెప్పుచున్నాడు. ఉత్పత్తిలేనిదియును అనగా అనేకవిధములుగా పరిణమించి నశించునదిగాన అనాది అని చెప్పబడుచున్నది. కలదనిగాని, లేదనిగాని వచింపశక్యముగానిది యును సర్వప్రపంచంబును సృష్టించునదియును అగు స్వరూపంబుగల మాయ సగుణబ్రహ్మాకం బైను పరమైనదియును ఈశ్వరవ్యవహారమును సంపాదించునది యును గాన ఇదియే ప్రధానంబనియును. కారణశరీరంబనియును చెప్పబడుచు న్నది. ఈవిధముగా ఒకేచైతన్యమైనను శుద్ధమలినఉపాధులచే జీవఈశ్వరులను నామంబులను బొంది విచారణచేతను ఉపాధిత్యాగంబుచే ప్రాప్తంబగుస్వరూ పంబును క్రమముగా శ్రవణ మనన నిధిధ్యాసలచే తనయందు అభేదముగా తెలియవలెను.

**శ్లో॥ కోశేష్వయం తేషు తు తత్తదాకృతి ర్విభాతి సంగాత్స్ఫటికోపలో యథా । అసంగరూపోఽయ మజో యతోఽద్వయో విజ్ఞాయతేఽస్మిన్పరితో విచారితే॥ 31**

టీక:_ మహావాక్యార్థముయొక్క విచారణమువలన గలుగుఫలమును చెప్పుచున్నాడు. ఆనందమయమునకు బ్రహ్మత్వము చెప్పినచో అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయములను నాలుగుకోశములయొక్క సంగమ

మువలన జపాదిపుష్పసంగమమున స్ఫటికమువలె అనేకాకృతులుగా భాసించు చున్నది. ఆనందమయునకును జీవత్వమును చెప్పుచో ఆనందమయకోశముతో కూడ అయిదుకోశములగును. ఈకోశసంబంధము యదార్థమైనదా కాదా యని విచారణచేసిననాడు ఈ ఆత్మ సంగరహితుడే యగును. "అసంగో నహి సజ్జతే" అనిశృతి అజుడుగాను, అద్వయుడుగానే తాను తెలియబడుచున్నాడు. కోశసంబంధమువలననే ఆత్మకు స్థూలోపాధిగలదని ప్రతీతి ఇట్టిప్రతీతి తత్త్వజ్ఞునకు లేదు. కోశసంబంధమునగల్గు ఆయాయీ రూపనిరాకరణమే విచారణమునకు ఫలము.

శ్లో॥ బుద్ధేస్త్రిధావృత్తిరపీహదృశ్యతే స్వప్నాదిభేదేన గుణత్రయాత్మనః । అన్యోన్యతోఽస్మిన్వ్యభిచారతో మృషానిత్యేపరే బ్రహ్మణి కేవలే శివే॥ 3_౨॥

టీక:_ జాగ్రదావస్థా మొదలగు ధర్మమున్ను బుద్ధిధర్మమేగాని ఆత్మధర్మముగాదని చెప్పుచున్నాడు. దూరస్థోఽపినదూరస్థః పిండస్థః పిండవర్జితః। విమలస్సర్వతోదేహీ సర్వవ్యాపీ నిరంజనః॥ "ఉత్తరగీత" దేహి యెల్లప్పుడును అజ్ఞానమువలన బ్రహ్మమునకు దూరమందుండునటుల గనబడినను దూరస్థుండు కాడు. దేహధారిగా గనబడినను దేహధారి కానేరడు. సకలవిధముల జీవుడు నిర్మలుండు అంతట పరిపూర్ణుండు అకలంకుండు స్వయంప్రకాశకుండును ఆత్మయందు జాగ్రత్స్వప్నసుషుప్తి భేదంబుచే త్రిపుటీరూపమగువృత్తి కనబడుచున్నది. ఆవృత్తియు సత్వరజస్తమోగుణత్రయస్వరూపముగల బుద్ధియొక్క ధర్మమును బుద్ధిచేనిశ్చయింపబడినదియును గాని యథార్థమగు ధర్మము కాదు. ఈత్రిపుటి అన్యోన్యము మార్పులుగలదగుటవలన స్వప్నకాలంబున జాగ్రత్సుషుప్తులు లేవు. జాగ్రత్తునందును స్వప్నసుషుప్తులు లేవు. సుప్తియందును జాగ్రత్స్వప్నంబులు లేవు. అందువలన ఉత్పత్తినాశంబులు లేనిదిని గుణత్రయాతీతమైనదిని వ్యాపకమైనదిని కేవలమైనదిని అసంగమైనదిని ఎల్లప్పుడు ఒకేరసముగలదిని ఆనంద

స్వరూపమైనదియగు ఆత్మయందు మారెడి స్వభావముగల ధర్మము సంభవింపదని భావము.

శ్లో॥ దేహేంద్రియప్రాణమనశ్చిదాత్మనాం సంఘాదజస్రం పరివర్తతేధియః । వృత్తిస్తమోమూలతయా ఉజ్జ్వలక్షణా యావద్భవే త్తావద సౌభవోద్భవః ॥33॥

టీక:_ అటుపైని సంసారమునకు కారణంబైన విడువదగిన వృత్తిని చెప్పుచున్నాడు. రజస్తమస్సులే ప్రధానముగాగల బుద్ధివృత్తి దేహేంద్రియప్రాణమనశ్చిదాత్మలయొక్క సంగమముతో ఎంతవరకు ననువర్తించుచున్నదో అంతవరకును జననమరణంబు అను ననుభవంబు తప్పదుగాన అన్నివిధముల విడువదగినది.

శ్లో॥ నేతిప్రమాణేన నిరాకృతాఖిలో హృదా సమాస్వాదితచిద్ఘనామృతః । త్యజేదశేషం జగదాత్తసద్రసం పీత్వా యథాంభః ప్రజహాతితత్ఫలమ్॥33

టీక:_ మహావాక్యవిచారణంబు చేసినతరువాత చేయదగినదానిని చెప్పుచున్నాడు. శ్లో॥ అహిమివజనయోగం సర్వదా వర్జయేద్యః కుణపమివ చ నారీం త్యక్తకామోవిరాగీ । విషమివవిషయాప్తిం మన్యమానో దురంతాం జగతి పరమహంసో ముక్తిభావం సమేతి॥ (ఉత్తరగీత) పరమహంసయగువాడు జనసంసర్గమును పామును విడుచునటుల విడువవలెను. కోరికలను వదలి స్త్రీని శవమువలె విడువవలెను. విషయాసక్తిని విషమునువలె దూరముగా విడువవలెను. అట్టి పరమహంస ముక్తిని బొందుచున్నాడు. "అథాత ఆదేశో నేతి నేతి" అను ప్రమాణంబుచే సమస్తజగంబును మిథ్యాత్వముగా గ్రహించి తరువాతను సత్త్వప్రధానంబైన మనస్సుచే బాగుగా చిద్ఘనామృతపానంబుగలవాడై దృశ్యసమూహంబును విడవవలయును. (అనగా హానోపాదానములనుబుద్ధివిషయములనుగా చేయక

ఆవిషయమున ఉదాసీనుండై యుండవలెను.) దేహేంద్రియాదులచేతనే స్వరూప జ్ఞానంబుగల్గును. గాన సాధకంబగు దేహంబును విడచుటను దృష్టాంతముతో చెప్పుచున్నాడు. మిక్కిలి దాహంగలవాడు మాధుర్యంబగు నారికేళనారింజరసమును గ్రహించి ఆఫలమునం దుదాసీనుండగునట్లు సర్వదృశ్యసారాంశమైన బ్రహ్మప్రాప్తినొంది సారహీనమైన దృశ్యవిషయమున ఔదాసీన్యత నొందునే గాని ఆ దేహత్యాగపరిగ్రహణమున దృష్టిని జొన్పడు.

శ్లో॥ కదాచిదాత్మా నమృతో నజాయతే నక్షీయతే నాపి
వివర్ధతేనవః। నిరస్తసర్వాతిశయస్సుఖాత్మక స్స్వయం
ప్రభ స్సర్వగతో ఽయమద్వయః॥౩౫॥

టీక:_ ఇతరమగుప్రపంచంబు అనిత్యమగుటచే దానియందు వైరాగ్యంబు గలుగుకొరకు ఆత్మకే నిత్యత్వమును చెప్పుచున్నాడు. శ్లో॥ తంతుమాత్రో భవేదేవ పటోయద్వద్విచారితః। ఆత్మతన్మాత్రమేవేదం తద్వద్విశ్వం విచారితమ్॥ (అష్టావక్రగీత). వస్త్రవిచారణంబున తంతురూపమే గనుపట్టునట్లు జగద్విచారణంబున సద్రూపమే గన్పడుచున్నది. ఆత్మ ఎప్పుడును క్రొత్తదిగాదు అనగా అనాదియైనది. అవస్థాభేదంబులైన "జాయతేఽస్తి విపరిణమతే వర్ధతేఽపక్షీయతేనశ్యతి" పుట్టుచున్నది, ఉంటున్నది, మార్పునొందుచున్నది, వృద్ధినొందుచున్నది, కృశించుచున్నది, నశించుచున్నదిఅను షడ్భావవికారరహితంబును సుఖరూపంబును ఆనంద స్వరూపంబును స్వప్రకాశంబును అగుచున్నది. దేహేంద్రియాదికము దుఃఖ స్వరూపమును పరప్రకాశంబును అగుచున్నది. "యస్యభాసాసర్వమిదంవిభాతి" అను శృతివలన వ్యాపకుండును వీడు నేను అను బుద్ధికి విషయుండైన ప్రత్యగాత్మయుకూడ అద్వయుండే అనగా బ్రహ్మస్వరూపమే "అయమాత్మా బ్రహ్మ" అను శ్రుతివలన బ్రహ్మాతిరిక్తమగు వస్తువులేదు. అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే॥ (భగవద్గీత)

శ్లో॥ ఏవంవిధే జ్ఞానమయే సుఖాత్మకే కథం భవో
దుఃఖమయః ప్రతీయతే। అజ్ఞానతో ఽద్యాసవ
శాత్ప్రకాశతే జ్ఞానే విలీయేత విరోధతః క్షణాత్॥ 3౬॥

టీక:- ఇట్టి వికారశూన్యంబైన ఆత్మయందు జననమరణాదిప్రవాహ రూపమగు సంసారము ఎట్లు భాసించుచున్నదనిన చెప్పుచున్నాడు. ఈ అధ్యాస అజ్ఞానమే మూలముగాగలది. అధ్యాసయనగా దేహాంతఃకరణాదికమందు నేను నాది అను భ్రాంతి. ఇట్టి అధ్యాసతోగూడిన సంసారమునకు (అనగా జననమరణరూపకమైనదానికి) నివృత్తి ఎట్లనిన సమాధానము చెప్పుచున్నాడు. అజ్ఞానమునకు జ్ఞానము విరోధముకాన జ్ఞానోత్పత్తి కాగానే సంసారమూలంబగు అజ్ఞానము నశించును. సర్పభ్రాంతి రజ్జువునుండి పోగానే సర్పభీతి రజ్జువునుండి నశించునట్లు అజ్ఞాననాశనము కాగానే అజ్ఞానజన్యమగు సంసారముగూడ నశించును. రజ్జ్వజ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ। భాతి తద్వద్చితిః సాక్షాత్ విశ్వాకారేణ కేవలా॥ అపరోక్షానుభూతి॥ అజ్ఞత్వమున త్రాడే పాముగాకనబడునట్లు తత్వవిచారణంబులేమిచే కేవలమగుచిత్తే జగద్రూపంబుగ కానుపించుచున్నది.

శ్లో॥ యదన్యదన్యత్ర విభావ్యతే భ్రమా దధ్యాసమిత్యాహు
రముం విపశ్చితః। అసర్పభూతే హివిభావనం యథా
రజ్జ్వాదికే తద్వదపీశ్వరే జగత్॥ 3౭॥

టీక:- పిదప అధ్యాసయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. సర్పముకాని త్రాటియందు సర్పభ్రాంతియే అధ్యాసయందురు. ఇట్టి అధ్యాసతోకూడియుండుటచేతను ఆత్మజ్ఞానంబులేమిచేతను ఈశ్వరునియందు సంసారరూపమగు సమస్త దేహాదిజగత్తు యథార్థముగనే ప్రకాశించుచున్నది.

శ్లో॥ వికల్పమాయారహితే చిదాత్మకే ఽహంకార ఏషః
ప్రథమః ప్రకల్పితః। అధ్యాస ఏవాత్మని సర్వకారణే
నిరామయే బ్రహ్మణి కేవలే పరే॥ ౩౮॥

టీక:- ఆత్మయందు జగత్తు ఏ అధ్యాసవలన ప్రకాశించుచున్నదనిన చెప్పుచున్నాడు. యథార్థంబుగా మాయాసంబంధములేనిదనియు కేవలమైనదనియు పరమైనదియును వ్యాపకంబైనదియు అగు ఆత్మయందు అధ్యాసరూపమగు 'నేను' అను బుద్ధియే సంసారకారణంబగుచున్నదని భావము.

శ్లో॥ ఇచ్ఛాది రాగాది సుఖాది ధార్మికా స్సదా
ధియస్సంసృతిహేతవః పరే। యస్మాత్ప్రసుప్తౌ తదభావతః
పరస్సుఖస్వరూపేణ విభావ్యతే హినః॥ ౩౯॥

టీక:- సంసారము బుద్ధినిష్టమేగాని ఆత్మనిష్టముగాదని అన్వయవ్యతిరేకములైన ప్రమాణములచే చెప్పుచున్నాడు. సర్వమునకు సాక్షియు, పరమును అగు ఆత్మయందు ప్రకాశించే సంసారమునకు కారణంబులగు యిచ్ఛామొదలగు రాగాదికములును, సుఖము మొదలగు ధర్మములును బుద్ధియున్నసమయమునసే గలుగుచున్నవి. రాగాదులు బుద్ధిననుసరించుట అన్వయము. ప్రసుప్తియందు తదభావమే వ్యతిరేకము. ప్రసుప్తియందు బుద్ధి స్వస్వరూపముతో ఏకీభావమును పొందుచున్నది గాని సంసారిననుభావనతో లేదు. అనగా సుఖమహమస్వాప్సమ్ (నేను సుఖముగా నిద్రించితిని.) అనునపుడు అనుభవమే తెలియుచున్నది. అయినను నేను ఏమియు ఎరుగనను మాటచే బీజాంకురమువలె బుద్ధి అజ్ఞానముతో లీనమయినందున సస్వరూపస్థితియని చెప్పబడదు.

శ్లో॥ అనాద్యవిద్యోద్భవబుద్ధిబింబితో జీవః ప్రకాశోఽయమితీర్య
తే చితః। ఆత్మా ధియస్సాక్షితయా పృథక్స్థితో బుధ్యా
పరిచ్ఛిన్నపరస్స ఏవ హి॥ ౪౦॥

టీక:_ తిరిగి తత్త్వంపదార్థస్వరూపమునే చెప్పుచున్నాడు. అనాదియైన అవిద్యవలన నుత్పన్నమైన బుద్ధిరూపమగు అంతఃకరణయందు ప్రతిబింబించిన చిత్ప్రకాశమే జీవుండని చెప్పబడుచున్నది. పరమాత్మయే బుద్ధికి సాక్షియగుటచే బుద్ధిధర్మసంబంధములేక అంతర్యామిత్వముగా వేరుగానే యుండి అంతటను వ్యాపించినవాడై జలదర్పణములయందు సూర్యునిపగిది బుద్ధి ప్రతిబింబితుడై దేహాభిమానంబున జీవనామకుండై యుండును. ప్రతిబింబాధారంబగు బుద్ధ్యభావంబున ప్రతిబింబనాశంబుచే జీవుడే జ్ఞానంబుచే బుద్ధిలక్షణపరిచ్ఛేదరహితుండై పరుండే యగుచున్నాడని ప్రసిద్ధి.

శ్లో॥ చిద్బింబసాక్ష్యాత్మధియాం ప్రసంగతస్త్వేకత్ర వాసాదనలాక్తలోహవత్। అన్యోఽన్యమధ్యాసవశాత్ప్రతీయతే జడాజడత్వం చ చిదాత్మచేతసోః॥ ౪౧॥

టీక:_ బుద్ధ్యాత్మలు పరస్పరాధ్యాసవశంబుననే పరస్పరధర్మభావంబులగుచున్నవని ధృఢత్వముకొరకు తిరిగి చెప్పుచున్నాడు. చిదాత్మచేతస్సులయొక్క పరస్పరతాదాత్మ్యారోపంబున జడాజడత్వంబు తోచుచున్నది. చిత్తవృత్తులకు జ్ఞానత్వమును, జీవాత్మకు జడత్వమును స్ఫురించుచున్నది. చిదాభాసుడు ఇంద్రియసాన్నిధ్యసంగమమున అగ్నితప్తలోహపిండముపగిది దేహేంద్రియధర్మములు కలవానివలె తోచుచున్నాడు.

శ్లో॥ గురోస్సకాశాదపి వేదవాక్యతస్సంజాతవిద్యానుభవో నిరీక్ష్యతమ్। స్వాత్మాన మాత్మస్థముపాధివర్జితం త్యజేదశేషం జడమాత్మగోచరమ్॥ ౪౨॥

శ్లో॥ అనాదానవిసర్గాభ్యా మీషన్నాస్తి క్రియా మునేః। తదేకనిష్ఠయా నిత్యం స్వాధ్యాసాపనయం కురు॥ (వివేకచూడామణి) స్వరూపనిష్ఠతోనుండు మునీశ్వరునకు ప్రపంచమును విడుచుట, విచారణచే ఆత్మప్రాప్తిని పొందుట అను

కర్తృత్వాభిమానముతప్ప వేరుక్రియలేదు. తదేకనిష్ఠతో నిత్యము నీకు కలిగిన స్వాధ్యాసను తొలగింపుము. పైనచెప్పినదానినే తిరిగి దృఢత్వముకొరకు చెప్పుచున్నాడు. గురుముఖమున వేదవాక్యములను వినుట విన్నదానియొక్క మననంబువలన రెంటివలనను కలిగిన జ్ఞానంబుచే జ్ఞానరూపంబగు స్వాత్మానుభవమైన నిదిధ్యాసకలవాడై ఆ చిదానందస్వరూపంబగు స్వరూపమును హృదయమందున్నదానిగా (అపరోక్షముగా) తెలిసికొని అనగా తానుగానెరింగి జడరూపమగు సమస్తజగత్తును విడువవలెను. అనగా ఉదాసీనభావమున నుండవలయునని భావము.

శ్లో॥ ప్రకాశరూపోహమజోఽహమద్వయో సకృద్విభాతోఽహమతీవ నిర్మలః। విశుద్ధవిజ్ఞానఘనో నిరామయస్సంపూర్ణ ఆనందమయోఽహమక్రియః ॥౪౩॥

టీక:_ ఉపాధిరహితమైన జ్ఞేయమును రెండు శ్లోకంబులచే చెప్పుచున్నాడు. నేను స్వప్రకాశరూపుండను, జన్మాదిహీనుండను, ద్వితీయరహితుడను, ఒకసారియైనను ఇతరునిచే ప్రకాశింపువాడను కాను. "న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః" (భగవద్గీత) ఆత్మ యేప్రకాశముచేనైన ప్రకాశించునది కాదు. మాయచేగలిగిన ఆవరణవిక్షేపములు లేనివాడను, విశుద్ధమగు చిదేకరసస్వరూపుడను, కర్తృత్వాభిమానరహితుండను, దేశకాలపరిచ్ఛేదశూన్యుండను, ఆనందమయుండను పరిణామహీనుండను.

శ్లో॥ సదైవ ముక్తోఽహ మచింత్యశక్తిమా నతీంద్రియజ్ఞాన మవిక్రియాత్మకః। అనంతపారోఽహమహర్నిశం బుధై ర్విభావితోఽహం హృది వేదవాదిభిః ॥౪౪॥

టీక:_ "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (అనిశ్రుతి) నేను కాలత్రయమునందు ముక్తుండను, సర్వధర్మరహితుండను. ఇట్టిది అట్టిది అని

నూహింపరాని శక్తిమంతుడను. ఇంద్రియాతిరిక్తంబగు జ్ఞానరూపుండను, క్రియా రహితుండను, దేశకాలపరిచ్ఛేద శూన్యుండను, విద్వాంసులచే రాత్రింపవలు భావనచేయబడుచున్న ఆత్మస్వరూపుండను. "అతతీత్యాత్మ" వ్యాపించునదిగాన ఆత్మ.

శ్లో॥ ఏవం సదాత్మానమఖండితాత్మనా విచారమాణస్య
విశుద్ధభావనా। హన్యాదవిద్యామచిరేణ కారకైః
రసాయనం యద్వదుపాసితంరుజః ॥౪౫॥

టీక:_ ఈవిధముగా భావనచేయువానికి ఫలమును చెప్పుచున్నాడు. ఈ చెప్పినరీతిగా ఆత్మస్వరూపమును విషయాదులచే లంపటముకాని చిత్తంబుతో విచారణచేయువానికి బ్రహ్మాకారాంతఃకరణవృత్తి కలుగుచున్నది. ఆవృత్తిగలిగిన తోడనే ఔషధసేవచే రుగ్మత నశించునట్లు దేహాదులను కలిగించు అవిద్య కర్మంబులతోకూడ శీఘ్రంబుగా నశించుచున్నది. పిదప అనుభవమే. శ్లో॥ తద్యుక్తమఖిలం వస్తువ్యవహారస్తదన్వితః। తస్మాత్సర్వగతంబ్రహ్మ క్షీరేసర్పిరివాఖిలమ్॥ (ఆత్మబోధ) సమస్తవస్తుసముదాయము సమస్తవ్యవహారము ఆత్మతో అనుసరించి క్షీరంబున ఘృతంబుపగిది సమస్తజగత్తు బ్రహ్మయందే నిమిడియున్నదను అనుభవముగలుగును.

శ్లో॥ వివిక్త ఆసీన ఉపారతేంద్రియో వినిర్జితాత్మా
విమలాంతరాశయః। విభావయే దేకమనన్యసాధనో
విజ్ఞానదృక్కేవలఆత్మసంస్థితః ॥౪౬॥

టీక:_ ధ్యానసమయమున జేయవలసిన విధానమును చెప్పుచున్నాడు. జనరహితంబగు ప్రదేశంబున పద్మాసనంబున గూర్చున్నవాడై ఉపారతేంద్రియుండై జయించబడిన అంతఃకరణగలవాడై ద్రష్టృదృశ్యభావనరహితుండై (అనగా నిర్వికల్పసమాధినిష్ఠుడై) తత్త్వజ్ఞానంబుకంటె ముక్తికి సాధనంబులేదని

నిశ్చయించుకొనినవాడై సంగరహితుండై విషయాంతరచింతనువలె దేహచింతను ఒకప్పుడు చేయనివాడై ఏకధారగా ధ్యానించవలెను.

శ్లో॥ విశ్వం యదేతత్పరమాత్మదర్శనం విలాపయేదాత్మని సర్వకారణే । పూర్ణశ్చిదానందమయో వతిష్ఠతే న వేదబాహ్యం న చ కించిదాంతరమ్॥ ౪౭॥

టీక:_ ఇంతేకాకుండగా ఈ భూతభవిష్యద్వర్తమానరూపంబుగా కనబడు విశ్వమును "తస్యభాసాసర్వమిదంవిభాతి" అను శ్రుత్యుక్తరీత్యా ఏ పరమాత్మ ప్రకాశంబుచే ఇది అంతయు ప్రకాశించుచున్నదో దానిని మాయాసన్నిధానంబున సర్వమునకు ఉపాదానంబుగాచెప్పబడిన ఆత్మయందు లయమొందించవలెను. (అనగా) ఉపాదానమునకన్న కార్యంబును వేరుగాచూడకూడదు. అట్టి దృష్టికలవానియొక్క లక్షణములను చెప్పుచున్నాడు. "సర్వంహాస్తిపదేనిమగ్నం" అనునట్లు ఆత్మానందంబున సమస్తకోరికలసిద్ధియు నిమిడియుండును. కోరికలేనివాడై చిదానమయుండై బాహ్యముగాని అన్తరముగాని అయిన దృశ్యమును చూడక సర్వత్రబ్రహ్మదృష్టిగలవాడుగా నుండును.

శ్లో॥ పూర్వం సమాధేరఖిలం విచింతయే దోంకారమాత్రం సచరాచరంజగత్ । తదేవ వాచ్యం ప్రణవో హి వాచకో విభావ్యతే జ్ఞానవశాన్న బోధతః ॥౪౮॥

టీక:_ సమాధికంటెపూర్వము చేయదగినదానిని చెప్పుచున్నాడు. శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః। వృత్తివిస్మరణం సమ్యక్ సమాధిర్జ్ఞానసంజ్ఞితః॥ (అపరోక్షానుభూతి) వికారరాహిత్యంబగు బ్రహ్మాకారవృత్తితో లెస్సగానుండు వృత్తులయొక్క విస్మరణమే సమాధియనియు జ్ఞానమనియు చెప్పబడుచున్నది. సమస్తవిషయ సముదాయరూపంబగు వృత్తిని (అనగా) ప్రపంచమనువృత్తిని వదలి బ్రహ్మాకారవృత్తిగానుండుటే సమాధి. దానికి

పూర్వము సచరాచరంబగు సమస్తజగత్తును ఓంకారరూపముగా భావనముచేయవలెను. ఆ ప్రణవమే వాచకరూపకముగా భావించబడుచున్నదని ప్రసిద్ధి. ఇట్టి భావన జ్ఞానవశంబుననే కలుగుచున్నది. బోధవలన భావనకలిగినవెంటనే నిర్విశేష బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నదా యనిన బ్రహ్మసాక్షాత్కారము సర్వవృత్తులను నశింపజేయునదిగాన వెంటనేగలుగదు. ఓం। ఇతి। బ్రహ్మ॥ ఓమిదగ్ంసర్వం ఓమిత్యేకాక్షరం బ్రహ్మ॥

**శ్లో॥ అకారసంజ్ఞః పురుషో హి విశ్వకో హ్యుకారకస్తైజస ఈర్యతేక్రమాత్ । ప్రాజ్ఞో మకారః పరిపఠ్యతేఽఖిలైస్సమాధిపూర్వం న తు తత్వతో భవేత్ ॥ ౪౫॥**

టీక:_ చెప్పబడినయర్థమునే వివరించి చెప్పుచున్నాడు. అకారంబను గుర్తుచే చెప్పబడేవాడు "తత్" అను పదమునకు వాచ్యుండును జాగ్రదవస్థకు సాక్షియును సమష్టివిరాట్స్వరూపుండును విశ్వుండనుపేరుచే చెప్పబడువాడు నగుచున్నాడు. ఉకారంబను గుర్తుచే చెప్పబడువాడు స్వప్నంబునకు సాక్షియును లింగదేహాభిమానంబుగలవాడును సమష్టిహిరణ్యగర్భుడనువాడును తైజసుండనునామంబున చెప్పబడుచున్నాడు. మకారమనుగుర్తుచే చెప్పబడువాడు సుషుప్తికి సాక్షియును మాయోపాధికుడును ప్రాజ్ఞపదంబుచే చెప్పబడుచు సమస్తవేదంబులందు తత్ పదముచేతనే చెప్పబడుచున్నాడు. ఇట్టిభావన సమాధికి పూర్వమే విచారణచేకలుగును. "సర్వంహస్తిపదేనిమగ్నం" అనునటు తత్వసాక్షాత్కారమైనపిదప ఉండదు. సర్వము బ్రహ్మయందు లీనమయినందున తరువాత నుండదని భావము. "అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమః శివోఽద్వైతం ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనా ఽత్మానం య ఏవం వేద య ఏవం వేద॥ (మాండూక్యోపనిషత్) మాత్రారహితంబును తురీయంబును వ్యవహారరాహిత్యంబును ప్రపంచోపశమంబును మంగళస్వరూపంబును ద్వైతరాహిత్యం

బును అగు స్వరూపంబే ఓంకారస్వరూపము సర్వవ్యాపకంబగు ఆత్మయే ఆత్మ స్వరూపంబుతో ఆత్మయందు ప్రవేశించుచున్నది. ఎవడు ఈ విధంబున తెలిసికొనుచున్నాడో వాడే శాంతిని బొందుచున్నాడు.

శ్లో॥ విశ్వం త్వకారం పురుషం విలాపయేదుకారమధ్యే
బహుధా వ్యవస్థితమ్। తతో మకారే ప్రవిలాప్య తైజసం
ద్వితీయవర్ణం ప్రణవస్య చాంతిమే ॥ ౪౦॥

శ్లో॥ మకారమప్యాత్మని చిద్ఘనే పరే విలాపయేత్ప్రాజ్ఞమపీహ
కారణమ్। సోఽహం పరం బ్రహ్మ సదా విముక్తి
మద్విజ్ఞానదృఙ్ముక్త ఉపాధితో మలః ॥౪౧॥

టీక:_ రెండుశ్లోకంబులచే లయింపజేయు ప్రకారము చెప్పుచున్నాడు. అనేకవిధంబులతోను స్థూలదేహాభిమానంబుతోనున్న అకారవాచ్యుండగు విశ్వుండనే పురుషుని ఉకారంబునందు లయంబుచేయవలెను. (అనగా లీనమయినట్లు భావనచేయవలెను.) తరువాతను తైజసుండనే లింగదేహాభిమానంబుగల పురుషుని అనగా ప్రణవమున రెండోవర్ణమగు ఉకారవాచ్యుని మకారంబున లీనమయినట్లు భావించి మకారంబుచేతను తత్ పదముచేతను చెప్పంబడు కారణదేహంబున అభిమానంబుగల ప్రాజ్ఞుండనేపురుషుని ఈచిద్ఘనంబునకు పరంబైన ఆత్మయందు "అతతీత్యాత్మ" వ్యాపించి యుండునదిగాన ఆత్మయందు లీనమయినట్లు భావించవలయును. ఓయీ! రాగద్వేషాదిమలినాదులతో కూడిన అహంపదార్థమునకు బ్రహ్మత్వభావన ఎట్లుకూడును అనిన వివరించి చెప్పుచున్నాడు. అహంపదవాచ్యుడగు ఆత్మ నిత్యమును ఉపాధిరహితుండును అమలుండు నగుచున్నాడు. ఇట్టిభావమునకును బ్రహ్మసాక్షాత్కారమునకును నిధిధ్యాసనంబు సాధనంబు నిధిధ్యాసనంబనగా విచ్ఛేదముగాని బ్రహ్మమాత్రప్రవృత్తి

శ్లో॥ ఏవం సదా జాతపరాత్మభావనస్స్వానందతుష్టః
పరివిస్మృతాఖిలః। ఆస్తే సదా నిత్యసుఖప్రకాశక
స్సాక్షాద్విముక్తోఽచలవారిసింధువత్ ॥౫౨॥

టీక:_ ఇట్టి భావనగలవానియొక్క లక్షణమును చెప్పుచున్నాడు. ఇట్టి భావనగల పురుషుండు పైచెప్పబడిన ప్రకారంబుగా ఎల్లప్పుడు నుదయించిన ఆత్మాకారవృత్తికలవాడును మరవబడిన సమస్తపుత్రదేహాదికంబుగలవాడును గాన స్వరూపానందంబుచే సంతుష్టుండై దుఃఖరూపంబగు విషయానందంబున విరక్తుండై సాక్షాత్ నిత్యమైన ఆత్మయందు సుఖప్రకాశకుండై ఉపాధిరూపంబులైన నామరూపంబులను విడచి అఖండితమగు ఆత్మస్వరూపంబుగలవాడై జీవన్ముక్తుండై విషయసంబంధరహితుండై నిశ్చలవారిసింధుః (నిస్తరంగసముద్రవతు) గానుండును.

శ్లో॥ ఏవం సదాఽభ్యస్తసమాధియోగినో నివృత్తసర్వేంద్రియగోచరస్య హి। వినిర్జితాశేషరిపోరహం సదా దృశ్యో భవేయం జితషడ్గుణాత్మనః ॥౫౩॥

టీక:_ ఈప్రకారముగా సదా సమాధి అభ్యాసముగలవాడై మరలిన ఇంద్రియవర్గవిషయములుగలవాడై కామాది శత్రువులను జయించినవాడై సర్వజ్ఞత్వ సత్యత్వ నిత్యత్వ నిత్యతృప్తత్వ బోధరూపత్వ స్వతంత్రత్వ నిత్యాలుప్తత్వానంతరూపములుగల షడ్గుణములుగలవాడై వశీకృతమగు అంతఃకరణగలయోగికి నేను సదా దృశ్యుండనగుచున్నాను. ఈకారణమున భక్తిగలవానికే సులభుడను గాని భక్తిహీనునకు సులభుండను గాను అని సూచించబడినది. "జన్మాంతరసహస్రేణ తపోధ్యానసమాధిభిః। నరాణాం క్షీణపాపానాం కృష్ణభక్తిః ప్రజాయతే। కృషిర్భూవాచకః। ణస్తునిర్వృతివాచకః (పాండవగీత) సర్వవ్యాపకచైతన్యమందు స్థిరుండగుచున్నాడు. అట్టిస్థిరతయే కేవలభక్తి యనంబడుచున్నది. "కృష్ణ కృష్ణేతి

కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః। జలంభిత్వా యథా పద్మం నరకాదుద్ధరామ్యహమ్" కృష్ణ కృష్ణ అని నిత్యము ఎవడు నన్ను స్మరించునో వానిని ఉదకమును భేదించు పద్మమువలె నరకమునుండి అనగా అజ్ఞాననరకమునుండి నేను ఉద్ధరించుచున్నాను. నేనన (అహంకారమునుండి) నేను నుండి విడువడజేయుచున్నాను.

శ్లో॥ ధ్యాత్వైవ మామాత్మన మహర్నిశం ముని స్తిష్ఠేత్సదా
ముక్త సమస్త బంధనః। ప్రారబ్ధమశ్నన్నభిమానవర్జితో
మయ్యేవ సాక్షాత్ప్రవిలీయతే తతః ॥౫౪॥

టీక:_ ఇట్టివిధంబుగ జీవన్ముక్తుండు ప్రారబ్ధవశముచే గలుగు అభిమానంబులేనివాడై భోగంబుల ననుభవించుచున్నను తదనంతరము నాయందే లీనించుచున్నాడు. అనగా "జలే జలం వియద్వ్యోమ్ని తేజ స్తేజసి వా యథా" (తత్వవివేకం) నా ధ్యానముచే నీటియందు నీరువలె, ఆకాశమునందు ఆకాశమువలె, తేజస్సునందు తేజమువలె నాయందు ఐక్యతనొందుచున్నాడు. అనగా అహంమమతలు పూర్తిగా ఎటకో వీడిపోవుచున్నవి.

శ్లో॥ ఆదౌ చ మధ్యే చ తథైవ చాంతతో భవం విదిత్వా
భయశోక కారణమ్। హిత్వా సమస్తం విధివాదచోదితం
భజేత్స్వ మాత్మాన మథాఖిలాత్మనామ్॥ ౫౫॥

టీక:_ సర్వధర్మములకంటె ఈధర్మంబ గొప్పదని చెప్పుచున్నాడు. సంసారము అన్నివిధములచే ఆదిమధ్యావసానములయందు భయదుఃఖములకు కారణమునుగా తెలిసికొని ఆదుఃఖములకు కారణంబు యాగముల చేయవలయునని చెప్పు వేదవాక్యములచే బోధితంబునగు సమస్త కామ్యకర్మంబును విడచి సమస్త జీవులకు స్వరూపంబును ఆత్మయు పరమేశ్వరుడునగు నన్ను సేవించవలయును. ధనవిషయమై తొలుత ఆర్జనయందు దుఃఖము పిదప పరిపాలనయందు భయము ను నాశమున భీతియు నెట్లు కలుగునో అట్లే విషయపదార్థంబంతయును

దుఃఖరూపంబుగా చూడవలయును.

శ్లో॥ ఆత్మన్యభేదేన విభావయన్నిదం భవత్యభేదేన
మయాత్మనా తదా। యథా జలం వారినిధౌ యథా
పయః క్షీరే వియద్వ్యోమ్న్యనిలే యథాఽనిలః ॥౪౬

టీక:_ నాయందు అభేదభావనంబుచే నామరూపంబుల విభాగంబులేక నారూపుండే యగుచున్నాడని దృష్టాంతముగా చెప్పుచున్నాడు. సర్వమునకు అధిష్ఠానంబగు నాయందు ఈశ్వరస్వరూపమగు జీవుని అభేదంబుగా భావించుచున్నప్పుడు పరమేశ్వరుండైననాతో అభేదంబుగా గోక్షీరమునందు అన్యక్షీరము వలెను మహాకాశమునందు ఘటాకాశంబువలెను మహావాయువునందు చర్మంబుచే అవచ్ఛిన్నమగు వాయువువలెను నామరూపవిభాగంబులేక ఏకీభావంబు బొందునట్లుగా నాయందు నైక్యత నొందును.

శ్లో॥ ఇత్థం యదీక్షేత హి లోకసంస్థితో జగన్మృషైవేతి
విభావయన్మునిః। నిరాకృతత్వాచ్ఛ్రుతియుక్తిమానతో
యథేందుభేదో దిశి దిగ్భ్రమాదయః ॥౪౭॥

టీక:_ ఈవిధముగా ఆత్మతత్త్వజ్ఞానము జగత్సత్యత్వభ్రమ స్వయముగానే పోవుచున్నదని చెప్పుచున్నాడు. జీవన్ముక్తిదశయందు ప్రారబ్ధవశంబున లోకవ్యవహారమును చేయుచున్నను జగత్తునులేనిదానిగా భావించుచు ఎప్పుడు ఇట్లు ఏకత్వంబును తెలసికొనుచున్నాడో అప్పుడే జగత్సత్యత్వభ్రమ శుక్తిరజతమువలె మరలుచున్నది.

శ్లో॥ యావన్న పశ్యేదఖిలం మదాత్మకం తావన్మదారాధన
తత్పరో భవేత్। శ్రద్ధాలురత్యూర్జితభక్తిలక్షణో
యస్తస్య దృశ్యోఽహమహర్నిశం హృది ॥౪౮॥

టీక:_ ఇట్టిజ్ఞానంబు ఎవడు ఎంతవరకు పొందజాలడో అట్టివాడు అంతవరకు నన్నారాధించుటయే యుపాయంబని చెప్పుచున్నాడు. సమస్త జగంబును నారూపమునుగా నేనే అధిష్ఠానముగలదానినిగాను నాయందె భాసించెడిదానినిగాను చూచునంతవరకు శ్రద్ధావంతుడై భగవదారాధనమే జ్ఞానప్రాపకమని దృఢవిశ్వాసముకలవాడై మిక్కుటమగు భక్తితో భగవంతుడనైన నా ఆరాధనయందు నిష్ఠుండుగావలెను. ఈవిధంబున చేసినవాడు నేను అహర్నిశలును దృశ్యుండనగుచున్నాను. "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్" అని స్మృత్యుక్తి.

శ్లో॥ రహస్యమేతచ్ఛ్రుతిసారసంగ్రహం మయా వినిశ్చిత్య
తవోదితం ప్రియ । యస్త్వేతదాలోచయతీహ
బుద్ధిమాన్స ముచ్యతే పాతకరాశిభిః క్షణాత్ ॥౫౯॥

టీక:_ అతిరహస్యమును శ్రుతిసారసంగ్రహమును నగు దీనిని నిర్ణయించి నీకు చెప్పితిని. దీనిని విచారించు బుద్ధిమంతుడు పాపసముదాయమునుండి క్షణకాలములో విముక్తినొందుచున్నాడు.

శ్లో॥ భ్రాతర్యదీదం పరిదృశ్యతే జగన్మాయైవ సర్వం
పరిహృత్య చేతసా । మద్భావనాభావితశుద్ధమానసః
సుఖీభవానందమయో నిరామయః ॥౬౦॥

టీక:_ చెప్పినదానినే దృఢత్వముకొరకు తిరిగి చెప్పుచున్నాడు. ఈకనబడు జగత్తునంతను మాయనుగా తెలిసికొని ఉదాసీనత్వమునుబొంది నాయొక్క భావనచేతనే శుద్ధమైన మనస్సుగలవాడవై ఉండుము. అని రాముడు ఆశీర్వదించుచున్నాడు. నిరామయుండవై సుఖవంతుడవుగమ్ము ఆనందమయుడవుగమ్ము విచారించగా పూర్వమునందే ఆనందరూపత్వమున్నను విస్మృతకంఠస్థభూషణ

ప్రాప్తివలె జప్తించబడినది. శ్లో॥ అహో అహం నమో మహ్యం దక్షో నాస్తీహ మత్సమః। అసంస్పృశ్యశరీరేణ యేన విశ్వం చిరం ధృతమ్ (అష్టావక్రగీత) నాతో సముండులేడు. నాకధికుండును లేడు. ఈశరీరంబుతో స్పృశింపకయే చిరకాల మునుండి విశ్వము ధరించబడినదిగాన నాకొరకు నేనే నమస్కారముచేసుకొనుచున్నాను.

శ్లో॥ యస్సేవతే మామగుణం గుణాత్పరం హృదా కదా వా యది వా గుణాత్మకమ్। సోఽహం స్వపాదాంచిత రేణుభిస్స్పృశన్పునాతి లోకత్రితయం యథా రవి ॥౬౧॥

టీక:_ ఈవిధంబుగానన్ను ఉపాశించువానికి లోకములను పావనము చేయునట్టి స్థితి గలుగుచున్నదని చెప్పుచున్నాడు. ఎప్పుడైనను ఒక్కసారియైనను నిర్మలాంతఃకరణంబుచే ఎవడు నన్ను ప్రకృతిసంబంధములగు రజస్తమోరూపగుణ రహితునిగాను గుణరూపమగు అవ్యాకృతముకంటెను పరునిగాను (అనగా మాయారహితునిగాను) లేక గుణరూపంబుగల ఈ కనబడు రూపగుణములు కల వానిగానైనను సేవించుచున్నాడో "ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః" (భగవద్గీత) అటువంటిభక్తుడు తనపాదంబున లగ్నమగు రేణువులచే మూడులోకంబులనుకూడ పవిత్రంబు చేయుచున్నాడు. మరియు తన కిరణంబులచే సూర్యుండు జగత్తును అంధకారరహితంబుగా చేయునట్లు మూలాజ్ఞాన నాశంబుగలవాడుగాన జగత్తును పావనము చేయుచున్నాడు.

శ్లో॥ విజ్ఞానమేతదఖిలం శ్రుతిసారమేకం వేదాంతవేద్యచరణేన మయైవ గీతమ్। యశ్శ్రద్ధయా పరిపఠేద్గురుభక్తియుక్తో మద్రూపమేతి యదిమద్వచనేషుభక్తిః ॥౬౨॥

టీక:_ ఇప్పుడు గ్రంధార్ధంబును ఆలోచించు సమర్ధతలేనివారికికూడ పఠించుటమాత్రమునను గొప్ప ఫలంబుకలదనియును చెప్పుచున్నాడు. విజ్ఞానమును గలుగజేయునదియును వేదాంతంబులగు ఉపనిషద్వాక్యంబులచే దెలియదగినది యునైన నా చరణకమలమును జగత్సృష్టి మొదలగు కర్మరూపమైన నాచరిత్ర యున్నుగల దీనిని పఠించినమాత్రముననే నన్ను బొందించు ఫలప్రాప్తి కలుగునా యను సందేహము ఎంతమాత్రము పడవద్దు. నావాక్యమునందు విశ్వాసమున్నచో అనగా గురువాక్యమునందు విశ్వాసమున్నచో తప్పక ఫలదాయకమగుచున్నదని భావము.

సమాప్తము.